# THE
# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY
# DEBATES

[*Part II—Proceedings other than Questions and Answers*]

## OFFICIAL REPORT

---

*Fourteenth Day of the Sixth Session of the*
*Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Tuesday, the 12th November,* 1957

The House met at Half Past Eight of the Clock

[MR SPEAKER IN THE CHAIR]

## QUESTIONS AND ANSWERS

(SEE PART I)

## BUSINESS OF THE HOUSE

మిస్టర్ స్పీకర్ బిజినెస్ అడ్వైజరీ కమిటీలో ఈ విధంగా తీర్మానం జరిగిందని సభ్యులకు మనవి చేస్తున్నాను.

12, 13 తేదీలలో ఆర్డినెన్సు గురించిన బిల్సు చర్చించబడుతాయి

14 వ తేది ఉదయం 8½ గంటల సమావేశంలో Madras District Boards (Andhra Pradesh Amendment) Bill — తీసుకొనబడుతుంది,

14 వ తేది మధ్యాహ్నం 4 గంటలకు సమావేశమై 4 నుంచి 7 గంటల వరకు, పటాస్కర్ రిపోర్టుమీద చర్చ ఉంటుంది

15 వ తేది నుంచి 20 తేదీవరకు Andhra Land Revenue Additional Wet Assesment, Surcharge Bill, Commercial Crops Bill వరుసగా తీసుకుంటారు

అవసరమైతే ఈ సమావేశం 21 తేదీ వరకు ఉంటుంది. వెళ్ళదలుచుకున్న గౌ సభ్యులు 21 వ తేదీన వెళ్ళుటకు ఏమీ ఆటంకం ఉండదనుకుంటాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి) డౌరీ బిల్లు ఎప్పుడు తీసుకుంటారు?

మిస్టర్ స్పీకర్ అది బిజినెస్ అడ్వైజరీ కమిటీలో పెట్టి ఒకరోజు మధ్యాహ్నం రెండుగంటలు కూర్చొని పూర్తి చేసుకొందాము

శ్రీ పి రామాచార్లు (ధర్మవరం - జనరల్) 22 వ తేదీన కూడ సమావేశం ఉంటుందా ?

మిస్టర్ స్పీకర్ 22 వ తేదీవరకు సభ్యులు ఉండవలసిన అవసరం ఉంటుంది. ఈలోగా Business పూర్తి చేసుకుంటామంటే ఎవరికీ అభ్యంతరం లేదు

శ్రీ జి. ఎల్లమందారెడ్డి (కనిగిరి) నేను యిచ్చిన Adjournment motion ఎప్పుడు వస్తుంది?

మిస్టర్ స్పీకర్ రూల్సు 70, 74 క్రింద వచ్చిన నోటీసులు ఆఫీసుకు పంపినాము మంత్రులకు తెలియపరుస్తారు ఈ సభాసమావేశం పూర్తి అయ్యే లోపలే వస్తాయి

శ్రీ పి సుందరయ్య (గన్నవరం) గౌ॥ సభ్యులు Adjournment motionsకు notice లు యిచ్చిన రోజుననే అవి సభలోకి రావాలి వాటిని rule out చేయటమో, చర్చకు తీసుకొనటమో ఆనాడే చేయాలి అవసరమయితే ఒక రోజు ఆలస్యం చేయవచ్చును కాని 22 వ తేదీ వరకు శాసనసభ ఉంటుందని అప్పటివరకు వాయిదా వేస్తామని, అంటే ఉపయోగం ఉండదు

మిస్టర్ స్పీకర్ లేదు ఒకటి రెండు రోజులలో వస్తాయి.

## POINT OF INFORMATION RE ARRIVAL OF VICE PRESIDENT OF INDIA IN THE CITY

శ్రీ పి. శ్రీరాములు (దుగ్గిరాల) · On a point of information, Sir, నిన్న, ఉపరాష్ట్రపతి శ్రీ రాధాకృష్ణన్‌గారు రాజధానీ నగరం విచ్చేసినట్లు, ఒక అఫిషియల్ ఫన్‌క్షన్ ఏర్పాటుచేసినట్లు తెలియుచున్నది. అటువంటివి, జరిగినప్పుడు, ఈ శాసనసభా సమావేశ సమయములో గౌ॥ సభ్యులందరూ ఈ నగ

రములో ఉన్నప్పుడు అందరికీ ఆహ్వానములు పంపి, అటువంటివారిని దర్శించుటకు, ఉపన్యాసము వినుటకు అవకాశం కలుగజేయుట సక్రమంగా ఉంటుంది అది జరగలేదు ఇకముందైనా అటువంటి functions జరిగినప్పుడు గౌ॥ సభ్యులను ఆహ్వానించవలెనని తమద్వారా ప్రభుత్వమును కోరుతున్నాను

రెవిన్యూ మంత్రి (శ్రీ కె వెంకటరావు) సాధారణంగా గౌ॥ సభ్యులనుకూడ పిలుస్తారు నిన్న ఎందుకు పిలువలేదో నాకు అర్థముకాలేదు కారులో ఎక్కించుకు తీసుకువెళ్తానని మా సెలక్టుకమిటీ సభ్యులందరకూ చెప్పాను కాని అందరినీ ఎందుకు పిలవలేదో తెలియుటలేదు. ముఖ్యమంత్రిగారు వచ్చిన తరువాత దర్యాప్తుచేసి, యికముందు తప్పకుండా ఏర్పాట్లు చేస్తాము

శ్రీమతి కె కనకరత్నమ్మ (నరసంపేట) కొంతమందికి ఆహ్వానములు వచ్చినవి, కొంతమందికి రాలేదు

శ్రీ కె వెంకటరావు ఆహ్వానములు పంపబడి, కొంతమందికి distribute కాలేదని అనుకొంటున్నాను. హాస్పిటల్ అడ్వైజరీ కమిటీకి సంబంధించి ఉన్న వారికి కొంతమందికి ఆహ్వానాలు వచ్చాయని తెలిసింది కొంతమంది ఫోన్ చేసి తెప్పించుకున్నారని కూడ తెలిసింది

మిస్టర్ స్పీకర్ అటువంటివారు వచ్చినప్పుడు గవర్నమెంటు ఒక function పెట్టి reception ఏర్పాటు చేయిస్తే బాగుండేది. అది జరగలేదు ఇప్పుడు హాస్పిటల్ వారు ఆర్గనైజు చేసుకున్నారు కనుక వారి యిష్టమువచ్చిన వారిని పిలుచుకొన్నారు ఒక సంగీత సభవారు, శ్రీ కృష్ణ గానసభవంటిది ఉంటే, వారి యిష్టము వచ్చినవారిని వారు పిలుచుకుంటారు అవి ప్రైవేటు ఫన్‌క్షన్సు శ్రీరాములుగారు చెప్పిన విషయం ఏమంటే—రిపబ్లిక్ ఆఫ్ ఇండియా యొక్క వైస్ ప్రెసిడెంట్ వచ్చినప్పుడు, స్టేషనులోనో, ఊరిలోకి తీసుకువచ్చో, ఒక రిసెప్షన్ ఏర్పాటుచేసి అందరినీపిలిస్తే బాగుండేది అది జరగలేదు. ఇకముందు ఏర్పాటు చేస్తామని మంత్రిగారు చెపుతున్నారు

శ్రీ కె. వెంకటరావు శ్రీ రాజేంద్రప్రసాద్‌గారు వచ్చినప్పుడు అందరినీ ఆహ్వానించటం, తీసుకువెళ్ళటం జరిగింది నిన్న శ్రీ రాధాకృష్ణన్‌గారు యిక్కడకు హఠాత్తుగా 4¾ గం॥ లకు రావటం aerodrome కు వెళ్ళటం 5 గం॥ లకు ఫంక్షన్ ఉండటం, టైము ఎక్కువలేకపోవటం, జరిగినందున, ప్రత్యేకంగా

reception పెట్టి సభ్యులను ఆహ్వానించుటకు వీలులేకపోయింది వారు తిరిగి ఒక పర్యాయం ఇక్కడకువచ్చి నాలుగయిదు రోజులు ఉండవలసినదని కోరడం జరిగింది తిరిగి వారు దయచేసినప్పుడు వారిని కలుసుకునేందుకు, వారితో ఆనందాలు అనుభవించేందుకు సభ్యులకు తప్పకుండా ఏర్పాటు చేసేయత్నం చేస్తాము

శ్రీ ఎ బి నాగేశ్వరరావు (రాజమండ్రి) · ఈ ఆహ్వానం ఆరోగ్యశాఖ కార్యదర్శిగారి పేర (in the name of the Secretary of the Health Dept) యిచ్చినారు.

మిస్టర్ స్పీకర్ ఏమైనా, గవర్నమెంటు తరపున సెక్రటరీలు శాసన సభ్యులకు ఆహ్వానములు పంపటం మర్యాద, అట్లా పంపకపోవటం మర్యాద కాదని ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నారు

శ్రీ జి. లచ్చన్న (సోంపేట) అధ్యక్షా, గౌరవనీయులైన ఉపాధ్యక్షులు ఇక్కడకు వచ్చారు కాబట్టి, శాసనసభ్యులు తమ సంజాయిషీ వారికి వినిపించే అవకాశం ఉంటే, బాగుంటుందని మన గౌరవనీయ సభ్యులయొక్క ఉద్దేశము

శ్రీ కె వెంకటరావు . రాధాకృష్ణగారు మన వైస్ ప్రసిడెంటే గాక తెలుగువారు, మనకు మాన్యులు అవటంవల్ల వారిని ఎన్నాళ్ళనుంచో ఇక్కడకు రావలసిందిగా అడుగుతున్నాము కాని వారు తక్షణమే వెళ్లిపోవలసిన పరిస్థితి ఉండటంవల్ల, నిన్న ఒక గంట, అరగంట కంటె ఎక్కువసేపు ఇక్కడ వారు ఉండలేదు. "వచ్చే నెలలోగాని, జనవరిలోగాని మీరు వచ్చి మా దగ్గర నాలుగైదు రోజులుండి వెళ్ళవలసిందని" నిన్న ముఖ్యమంత్రిగారు వారిని కోరారు వారు అంగీకరించారు. వారు మళ్ళీవస్తారు. అందుకు ఇక్కడ ఉన్నసమయంలోనే వారిని తీసుకువచ్చి, అందరూ వారిని కలుసుకొనేటట్లు, వారితో సంభాషించేటట్లు చేయవచ్చు. ఈ ఫంక్షన్ అరేంజి చేయటంలో అక్కడ ఉండే స్థలాన్నిబట్టి కొన్ని పద్ధతులు నడుస్తాయి. ఇది ఏదీ, ఎవరిమీద, ఇంటెన్షనల్ గా జరిగిందికాదు. వైస్ ప్రసిడెంటుగారిని కలుసుకొనే ఏర్పాట్లు ఇకముందు చేయబడతాయి.

మిస్టర్ స్పీకర్ : సభ్యులు అనేది "పెద్దవాళ్ళు వచ్చినపుడు వారిని కలుసుకోటానికి అందరికి అవకాశం ఇవ్వవలె. వారు ఎప్పుడు వచ్చేది గవర్నమెంటుకు ముందుగనే తెలిసి ఉంటుంది, అందుచేత అరగంట ముందుగా

తెల్పిఉంటే బాగుండేది'' అని అది జరగక పోవటం పొరపాటే ఇకముందు జాగ్రత్తగా చేస్తారని గవర్నమెంటువారు చెబుతున్నారు గనుక, సభ్యులు అంగీకరించమని కోరుతున్నాను తరువాత, మంత్రి డి సంజీవయ్యగారు సెలక్టు కమిటీ రిపోర్టు ప్రజంట్ చేయవలసి ఉంది ఆ సెలక్టు కమిటీ వారు పని పూర్తి చేయలేక పోయినారు కాబట్టి 31-3-1958 వరకు వాయిదా ఇవ్వవలసిందిగా కోరుతున్నారు

## REPORT OF THE SELECT COMMITTEE ON THE COWS AND SHE-BUFFALOES SLAUGHTER PROHIBITION BILL, 1956

*The Minister for Labour & Social Welfare (Sri D. Sanjivayya)* I beg to move

"That the time for presenting the Report of the Select Committee on the Cows and She-Buffaloes Slaughter Prohibition Bill, 1956 be extended till 31st March 1958 "

*Mr Speaker* The question is

"That the time for presenting the report of the Select Committee on the Cows and She-Buffaloes Slaughter Prohibition Bill, 1956 be extended till 31st March 1958 "

The motion was adopted

## SELECT COMMITTEE REPORT ON THE ANDHRA LAND REVENUE (ADDITIONAL WET ASSESSMENT) (ANDHRA PRADESH AMENDMENT) BILL, 1957

*Sri K Venkata Rao* I beg to present the report of the Select Committee on the Andhra Land Revenue (Additional Wet Assesment) (Andhra Pradesh Amendment) Bill, 1957

*Mr Speaker* The Report is presented to the House

## THE ANDHRA PRADESH AGRICULTURAL HOLDINGS (CENSUS) BILL, 1957

**Sri K Venkata Rao* I beg to introduce the Andhra Pradesh Agricultural Holdings (Census) Bill, 1957 and move that the Bill be taken into consideration at once

అధ్యక్షా, నేను దీనిపై దీర్ఘమైన ఉపన్యాసము చెప్పదలచుకోలేదండి వచ్చే సవరణలు బట్టి కొంత చర్చచేసే అవకాశం ఉన్నప్పటికి, నేను త్వరలోనే డిస్పోజ్ అవుతుందని అనుకున్నాను త్వరలో డిస్పోజ్ చేయాలి కూడాను దేశంలో ఉన్న వాస్తవమైన పరిస్థితులు తెలుసుకొనటానికి కొన్ని అంకెలు కావలసి వచ్చాయి ఇదివరకే, పాత ఆంధ్రరాష్ట్రంలోను, పాత హైదరాబాదు రాష్ట్రంలోను ఇందుకు సంబంధించిన విషయ సేకరణ జరిగింది పాత ఆంధ్రరాష్ట్రానికి సంబంధించినంతవరకు ఆ లెక్కలు అసమగ్రంగా ఉండటంవల్ల ఆ లెక్కలవల్ల మనకు కావలసిన సంజాయిషీ పూర్తిగా తెలియకపోవటంవల్ల, తిరిగి దానిని గురించిన కొన్ని అంకెలు సేకరించటముకొరకు యీ బిల్లును సభ్యులముందర పెట్టటం జరిగింది శాసనసభ సమావేశం కాని సమయంలో యీ బిల్లు ఆర్డినెన్సు రూపంలో గవర్నరుగారిచేత ప్రకటించబడింది దానిని శాసనం చేసే ఉద్దేశంతో, యీ బిల్లును సభ్యులముందు పెట్టవలసివచ్చింద ఈ బిల్లు తాత్కాలికమైనది ఇది స్థిరంగాఉండే బిల్లుకాదు ఈ పర్పస్ అవగానే, దీని ఫంక్షన్ కూడ ఐపోతుంది దాదాపు డిశంబరు 20వ తేదీనాటికి ఈ బిల్లుయొక్క పని అయిపోతుందన్నమాట. కాబట్టి ఆ విధంగా సేకరించిన అంకెలన్నీ లెక్కలు వేసుకొని, వాటినుంచి నేర్చుకోవలసినవి నేర్చుకొని, పనులు చేసుకోవలసి ఉంటుంది. ఇది చాలా సింపుల్ బిల్లు పదకొండు జిల్లాలలో ఇవాళ ఇరవై ఎకరాలపైన ఉన్నవారు తమకు ఏ ఊళ్ళో ఆస్తి ఉన్నదో, ఎంత భూవసతిఉన్నదో అదంతా స్టేటుమెంటుద్వారా ప్రభుత్వానికి సమర్పించవలసి ఉన్నది. ప్రత్యేకంగా 20 ఎకరాలే ఎందుకు పెట్టవలసి వచ్చిందంటే, 20 ఎకరాలు పైన ఉన్నవారు కొంచెం విద్యావంతులై ఉంటారు, లేదా విద్యావంతులు కలిగిన కుటుంబాలవారై ఉంటారు కాబట్టి ఆ ఫారమ్స్ పూర్తిచేయగలరనే ఉద్దేశంతో (పెట్టబడిందికాని, దీనినిగురించి వేరే అపోహపడవలసిన అవసరము లేదు.) "20 ఎకరాల ఖండాలు ఇన్ని ఉన్నాయి, 30ఎకరాల ఖండాలు ఇన్ని ఉన్నాయి" అన్న విధంగా మనదగ్గర లెక్కలు ఉన్నాయి 20 ఎకరాలు పైన ఉన్న హోల్డింగులోగాని, ఏ హోల్డింగులోగాని ఎంతమంది భాగస్వాములు ఉన్నారు, యీ 20 ఎకరాల ఖండం ఒక వ్యక్తికి చెందిందా, లేక 3, 4 గురు వ్యక్తులకు చెందిందా అన్న విషయాలు మనం ఆలోచించుకోవలసి ఉన్నది, ఆ భూమిమీద ఎవరికి స్వామ్యం ఉన్నదో, ఆ విషయం ప్రభుత్వానికి ఇదివరకు తీసుకొన్న లెక్కలవల్ల దొరకలేదు. కనుక ఇప్పుడు ఆ విషయమై యీ బిల్లు తీసుకు రావలసిన అవసరము ఏర్పడింది.

మనము క్రొత్తగా భూసంస్కరణల చట్టం పెట్టదలచుకొన్నాము. దానికి కొన్ని ఆధారాలు కావలసి ఉన్నవి ఆ కారణంగా మాత్రం, భూసంస్కరణలు

ప్రవేశపెట్టటం అపు చేయదలచుకోలేదు అనుకొన్న ప్రకారం దానిని తీసుకు రావటానికి ప్రభుత్వం సంసిద్ధంగా ఉన్నది కాబట్టి బహుళ వ్యాపకంగా యీ సంస్కరణలు చేయటానికి, ఈ బిల్లుద్వారా సేకరింపబడు అంకెలను వినియోగించుకొనవలసిఉన్నది అప్పుడప్పుడు మనుష్యులలెక్కలు ఎట్లాతీసుకొంటున్నామో, అదేవిధంగా దేశం సాంఘిక వ్యవస్థయొక్క స్వరూపంయొక్క నిర్ణయంకూడ చేసుకోవలసిన న్యాయం ఉన్నది ఆ విధంగా చేయకపోతే దేశంలో ప్రణాళికలు వేసుకోటానికి కష్టంఅవుతుంది ప్రణాళికలకు మంచి స్వరూపం కల్పించటానికి ఇటువంటి లెక్కలు అవసరము ఈ అవసరం గుర్తించే మన దేశంలో స్టాటిస్టికల్ పద్ధతి విపులంగా, ఇదివరకు ఉన్న మార్గాల్లోనే కాకుండా, ఎక్కువ మార్గాల్లో తీసుకు రావలసిన అవశ్యకత ఏర్పడింది మొదటి పంచవర్ష ప్రణాళికలోకంటే, రెండవ పంచవర్ష ప్రణాళికలో యీ స్టాటిస్టికల్ ఆర్గనైజేషన్ చాలా పెంపుచేశారు- ఇప్పుడు ఇంకా పెంపుచేసుకొని వెళ్ళవలసిన అవశ్యకత ఉన్నది ఇప్పుడు 14 అణాల పంట అంటే, అసలు 16 అణాల పంట ఎంతో, అది స్థిరంగాలేదు, ఏరకం భూమికి ఎంతపంట పండుతుందో నిర్ణయం లేనపుడు, 14 అణాలు పంట అంటే, అది రెలిటివ్ మేటర్ అయిపోతోంది. అందుచేత కొన్ని దృఢమైన నిర్ణయాలు యీ సందర్భంలో తీసుకోవలసి ఉన్నాయి మనము రెండు పనులు చేయదలచుకొన్నాము ఒకటి, భూ సంస్కరణలు తీసుకు రావటము, రెండు, భూమిమీద ఉన్నపన్నుల విధానాలన్నీ క్రోడీకరించి, ఒకేపద్ధతిని అందరికి అర్థమయ్యేటట్లు, లాండ్ రెవిన్యూకోడ్‌కు లోబడి పన్నులు వేయుట దీనికి సంబంధించినవి ఆలోచించుటకు ఒక కమిటీని ఏర్పాటు చేయబోతున్నామని సభ్యులకు మనవిచేసే ఉన్నాను అందువల్ల ఇవన్నీ ఒక దానిలో ఒకటి భాగాలుగా ఒకదాని సహాయం ఇంకోదానికి లభిస్తూ తీసుకు వెళ్ళటం మా ఉద్దేశము ఈ అంకెలకు సంబంధించినంతవరకు కొంతమంది పత్రికలలో "మూడు నెలలలో అంకెలు ఇమ్మనటం ఎందుకు ? గవర్నమెంటు దగ్గర లెక్కలు లేవా ? కరణాలను కూడమంటే సరిపోదా" అని వ్రాస్తున్నారు అది సాధ్యమయ్యే విషయంకాదు, ఒక ఊళ్ళోకాదు, ఒక ఫిర్కాలోకాదు, రెండు జిల్లాలలో కూడ భూములు ఉన్నవారు ఉన్నారు ఇంతమంది కరణాలను ఒకచోటకు చేర్చి లెక్కలు తయారు చేయించటం సాధ్యమయ్యే విషయంకాదు. ఒక వ్యక్తియొక్క భూమి ఎక్కడెక్కడ ఉన్నదో కరణాలకు తెలియటం కష్టం కనుక, డిక్లరేషన్ చేయటానికి చాలా అవశ్యకత ఎర్పడింది ఇదేమి పెద్ద కష్టంకాదు "నాకు ఫలానా ఊళ్ళో ఇంత భూమి ఉంది" అని లెక్కలు చూపితే సరిపోతుంది ఒకరు అనుకొన్నారు, "ఏవో భూ సంస్కరణలు రాబోతున్నాయి, దాని ప్రకారం 20 ఎకరాల

కంటె పైన ఉన్నవారంతా తమ భూమిని అమ్ముకోండి, లేదా పంచుకోండి అది స్ఫురణకు తేవటానికి యీ పనంతా చేశారు" అని ఇంకా ఇన్‌వర్‌సెడ్ కామాస్‌లో 'ఇది దారుణం' అని ప్రచారం చేశారు. ఇంకొకరు "20 ఎకరాల పరిమితే పెట్టేస్తారేమో, అప్పుడే, సంఘం తలక్రిందులైపోతోంది, రైతు అనే వాడు యీ ప్రపంచంలో కనుపించడు, ఇది చాలా అన్యాయం, మనమంతా 20 ఎకరాలకు లోపుకు భూమిని పంచుకొంటే మంచిది'' అని అనుకొంటున్నారు ఇదంతా వారి అపోహ తప్ప వేరుకాదు

ప్రభుత్వము ఏ రకమైన నిర్ణయమునకు వస్తుందో కాని,అది యింకను నిగూఢముగ ఉన్నది కాని యీ బిల్లుకు దానికి ఏలాంటి సంబంధము లేదు అవి 5 ఎకరాలు కావచ్చు, 50 కావచ్చు, 35 కావచ్చు, 25 కావచ్చు, 17 కావచ్చు, 1975 ఎకరాలు కావచ్చు అది అందరు నిర్ణయించేది కాదు. అందువల్ల ఎవరికో ఒకరికి ఉపకారము చేయటానికి ప్రభుత్వము చేస్తున్న దన్నది విమర్శనకొరకు చేస్తున్న విషయమే కాని, నిజానికి అది నాహృదయములో కాని, ప్రభుత్వము యొక్క హృదయములోగాని, లేకపోతే యీ బిల్లు యొక్క ఉద్దేశ్యములోగాని, లేదని నేను ఘంటాపథముగ చెబుతున్నాను అవిధముగ తగ్గించుకోవాలని యత్నంచేసేవారు పొరబాటుచేస్తున్నారేమోననిఅనుకుంటాను శాసన సభవారియొక్క ఉద్దేశ్యము ప్రకారము గత 1955 వ సం॥ నుంచి జరిగినటువంటి పథకములు అన్నీ లెక్కలోనికి తీసుకుని రావాలని అనుకుంటే యీ రోజున వ్రాసుకున్నది పోదు లేదా, తిరగవేసి తీసుకోవచ్చు కూడాను. సాంప్రదాయ సిద్ధముగా గృహఛిద్రాలవల్ల, గృహములలో ఏర్పడిన పరిస్థితుల వల్ల మనకు ఉన్న న్యాయశాస్త్రములవల్ల జరగవలసింది ఏదో అది జరుగవచ్చు కాని పెట్టినటువంటి limit పైకికాని క్రిందకుకాని వినియోగించుకుందామనే అవకాశము తీసుకుందామని ఎవరైనా అనుకుంటే వారుకూడ పొరపాటు పడ్డారేమోనని చెప్పవచ్చు. అందువల్ల దీన్నిగురించి నీతిగాని, ప్రసంగముగాని, logic గాని దీనికి apply చేయవద్దుఅని నేను గౌరవసభ్యులను కోరుతున్నాను ఇది పెట్టే అంకెలకు సంబంధించినది ఆ అంకెలను మనము ఏ విధముగ వినియోగించుకోవాలి అనే విషయంకూడ మనము ముందు చూచుకోవలసిందే కాని, ఆ అంకెలు లేనప్పుడు మనము లెక్కకు తీసుకోటానికి వీలులేదు. ఇప్పుడు యింకొక విషయముకూడ వున్నది ఈ సందర్భములో ప్రభుత్వము యొక్క లెక్కల ప్రకారము నేను చెప్పిన ఖండాలను యీ సందర్భములోని భూఖండాలను లెక్క చూచుకుంటే పాత ఆంధ్ర రాష్ట్రములో ఒకలక్ష ఎనభై రెండు వేల మంది ఇరవైరెండు ఎకరములుగల ఖండములు గలవారు ఉన్నారని తెలిసింది.

కాని నేను చెప్పినట్లు యిది సరైన లెక్కకాదు ఎందుకంటే ఇరవై ఎకరాలు పైన ఉన్నవారు ఎక్కువమంది ఉండవచ్చు తక్కువమందికూడ ఉండవచ్చు కాని దీనికి correct గా లెక్క ఎట్లా తేలుతుంది? ఇది తెలుసుకునేది ఎట్లా? ఆ ఒక్క విషయముకోసము యీ బిల్లును తీసుకునివచ్చాము ఇలాంటి బిల్లు రాగానే, దీనికి విపరీతమైన అర్థములుతీసి, దీనిమీద రాబోయేటటువంటి శాసనముల యొక్క సమగ్రమైన స్వరూపము crystal clear గా మనమిత్రులు, —ఏదో సామెత చెప్పినట్లు, పూర్వము కొందరు గాజురాయి చేతిలో పట్టుకుని, అందులోనుంచి భవిష్యత్తు అంతా, ప్రపంచము యొక్క భవిష్యత్తు మనుష్యుల యొక్క దేశముల యొక్క భవిష్యత్తు అంతా చెప్పేవాళ్ళు దానికి crystal guage అంటారు— అదేమాదిరిగ అందులోనుంచి అలాంటి crystal గాజును తీసుకుంటే, పొరబాటు పడతారని నేను మనవి చేస్తున్నాను తరువాత చేయవలసిన సంస్కరణలు, సంఘము యొక్క అభ్యుదయాన్ని దృష్టిలో పెట్టుకొని, ఆర్థికాభ్యుదయాన్ని దృష్టిలో పెట్టుకొని, పంచవర్ష ప్రణాళికను దృష్టిలో పెట్టుకొని అందులో యివ్వబడిన సలహాలను దృష్టిలో పెట్టుకొని, మనరాష్ట్ర పరిస్థితులను దృష్టిలోపెట్టుకొని సమగ్రంగ దేశాభివృద్ధికొరకు కావలసిన కార్యక్రమములు చేయబడుతాయి కాని, యిప్పుడు ఏవో కొన్ని అపోహలను యిందులోనుంచి తీసుకునివచ్చి crystal guage ను చేసి, అది కొంతమంది ఇక్కడ పనికిరాదు అని, కొంతమంది పనికివస్తుందని అనవసరమైన ఆందోళన తీసుకుని రావడము పొరబాటు. దీనికి విపరీతమైన అర్థములు కల్పించడము అంతకంటె పొరబాటు అని నేను మీకు మనవి చేస్తున్నాను కాబట్టి యీ బిల్లును గురించి శీఘ్రతరమైన చర్చ జరిపి, దీనిని తప్పకుండా త్వరలో pass చేయిస్తారని సభ్యులందరికీ మీద్వారా మనవిచేస్తూ, దీనినిగురించి తక్షణమే ఆలోచించమని సభవారి అందరిఎదుట పెడుతున్నాను

మిస్టర్ స్పీకర్ . ఈ బిల్లును యీ రోజున ఒంటిగంటకు పూర్తిచేస్తాము ఒక గంటన్నర general discussion కు, ఒక గంటన్నర సవరణలకు వినియోగించడము జరుగుతుంది

శ్రీ పి సుందరయ్య అధ్యక్షా, ఆర్డినెన్సు బిల్లుతోసహా రెండు బిల్లులు ఉన్నవి దీనికి ఇవ్వాళ, రేపు కావలసిఉంటుంది

శ్రీ కె వెంకటరావు లేదండి మూడు బిల్లులు - Extension of Forests Act తోచేరి మూడు బిల్లులు ఈ మూడుకూడ రేపటితో అయిపోవాల్సి ఉంటుంది.

2

శ్రీ పి సుందరయ్య ఏమైనప్పటికినీ ఇది చాలా ముఖ్యమైన బిల్లు కాని మంత్రిగారు చెప్పినంత సులభమైన బిల్లుకాదు దీనిని యీ రోజున ఒంటి గంట లోపల పూర్తిచేయాలంటే, అది సాధ్యమయ్యే విషయముకాదు, దీనిని చర్చించటానికి రేపుకూడ తీసుకోవలసి ఉంటుంది

మిస్టర్ స్పీకర్ రేపు మధ్యాహ్నము లోపల యీ మూడు బిల్లులు కూడ పూర్తిచేయవలసి యుంటుంది

శ్రీ కె వెంకటరావు అధ్యక్షా, రేపుమధ్యాహ్నము ఒంటిగంటలోపల యీ మూడుబిల్లులు కూడ అయిపోయేటట్లుగా మీరే ఏర్పాటు చేయండి ప్రతిపక్షనాయకులు, మీరుకూడ దీనికి అంగీకరిస్తారని అనుకుంటాను

మిస్టర్ స్పీకర్ ఇవ్వాళటి బిల్లు రెండుగంటలలో general discussion పూర్తిచేద్దాము Amendments కూడ ఉన్నవి అవి తరువాతచూద్దాము.

శ్రీ పి. సుందరయ్య ఏమైనప్పటికి, general discussion రెండుగంటల లోపల పూర్తికాకపోవచ్చు అని అనుకుంటాను.

మిస్టర్ స్పీకర్ . తమరు ముందు యీ బిల్లుపై చర్చ ప్రారంభించండి.

శ్రీ పి. సుందరయ్య అధ్యక్షా, ఇది 21 వ నెంబరుగల బిల్లు. "A Bill to provide for the collection of statistics for agricultural holdings in certain areas of the State" అనే బిల్లు ఇప్పుడు దీనినిగురించి చర్చించ బోతున్నాము. మంత్రిగారు దీనిని ప్రతిపాదిస్తూ ఇప్పుడు పాత ఆంధ్రరాష్ట్రి మునకు సంబంధించిన Land Census లెక్కలు కేవలము భూఖండములు, ఎంతెంతో అంటే, పదిఎకరాలో, ఇరవైఎకరాలో అంతకుమించో, లేకపోతే యీలోపల ఉన్న భూమండలములు అనేవి మాత్రమే తప్ప, యివిఅన్నీ ఒక్కరి పేరులోనే ఉన్నవా, లేకపోతే వేరేవ్యక్తుల పేర్లలో ఉన్నవా అనే లెఖ్ఖలు సేకరించడం ప్రభుత్వమునకు సాధ్యము కావడములేదు. కాబట్టి యీ లెక్క లను బట్టి భూసంస్కరణలు తీసుకుని రాదలచుకున్నప్పుడు యివి అవసరము అని అనుకొన్నప్పుడు ఎవరెవరివద్ద ఎంతెంతభూమి ఉన్నది, అది ఎవరిపేర్లలో ఉన్నది, వాటివిస్తీర్ణముతో సహా ఉన్న వివరాలు ప్రభుత్వమునకు అవసరము అయిఉన్నది గనుక, యీ బిల్లును తీసుకుని వస్తున్నాము అని చెప్పడము జరి

గింది 1953-54 సంజలో ఉన్న భూఖండముల లెక్కలు సరియైనవికావు అని మంత్రిగారు చెప్పినారు ఇప్పుడు ప్రభుత్వానికి యీ బిల్లు ద్వారా రావలసిన లెక్కలు యిదివరకు ప్రభుత్వమువద్ద లేవు గనుక యిప్పుడు యీ బిల్లును తీసుకుని రావలసిన అవసరం ఏర్పడింది అని చెప్పడము జరిగింది ఏమైన ప్పటికినీ ఈ బిల్లును తీసుకునిరావటానికి ప్రభుత్వంయొక్క ఉద్దేశ్యము ఏమిటి ? ఏదో ఊరకనే ఈ రోజున భూఖండముల లెక్కలు తీసుకోటానికి మాత్రమే ఈ బిల్లును తెచ్చాముఅంటే, ఈలెక్కలను ప్రభుత్వం ఏ ఉద్దేశ్యంతో అడుగుతున్నారు? ఊరకనే Land Census లెక్కలు అని చెప్పినప్పటికినీ, దీనికి వెనుక ఏదో ఒక ఉద్దేశ్యం పెట్టుకొనిగదా ప్రభుత్వము ఈ లెక్కలు కావాలంటున్నారు ? అంటే భవిష్యత్తులో భూమికి గరిష్ట పరిమితిని ఏర్పాటుచేయటానికి ఒక్కొక్క కుటుంబ మునకో, లేకపోతే ఒకొక్క వ్యక్తికో, ఆస్తికలిగినటువంటి ఒక వ్యక్తికో, లేకపోతే ఒక్కొక్క కుటుంబానికో ఎంత గరిష్ట పరిమితి ఉండాలి అనేదానికి చట్టము చేయటానికి ప్రాతిపదికగా లెక్కలు సేకరించటానికి యిది చేస్తున్నాము అని చెప్పవచ్చు లేదా, ప్రభుత్వానికి యింకొక ఉద్దేశ్యముకూడ ఉండవచ్చు ప్రభుత్వదృష్టిలో యిది లేకపోవచ్చు గాని, యీ లెక్కలు యింకొకదానికి మరొకవిధముగ ఉపయోగ పడవచ్చును ఇదివరకే Surcharge Bill అనేది ఒకదానిని Select Committee కి పంపించాము రేపో ఎల్లుండో దాని విషయ ములో సెలెక్టు కమిటీ రిపోర్టుకూడ వస్తుంది అది మనముందుకు రాబోతున్నది ఈ surcharge అనేది ఒక gradation పద్ధతిమీద పెట్టటానికికూడ అందులో సూచన ఉన్నది. ఈ gradation పెట్టినప్పుడు అది రూపాయలలోనికి మార్చే దానిలో ఒక వ్యక్తి గాని పట్టాదారుగాని, లేకపోతే ఒక కుటుంబ మేనేజరు గాని ఎంతపన్ను చెల్లించవలసి ఉంటుందో, అంటే ఉదాహరణకు పదిరూపాయలు అంతకులోపల అయితే- మినహాయింపురేటు, పది నుంచి నూరు రూపాయల వరకు ఒకరేటు, నూరు నుంచి అయిదు వందలవరకు ఒకరేటు, అయిదు వందలపైన యింత రేటు అనే విధముగ ఒక బిల్లును మనము చర్చించి, తరువాత సెలెక్టు కమిటీలో దానిని పూర్తిగా పరిశీలించటానికి, పంపించాము. అక్కడకూడ gradation పద్ధతి ఉన్నది. ఆ gradation తెలుసుకోటానికికూడ సరియైన లెక్కలు ప్రభుత్వము వద్ద ఉన్నవా అంటే లేవు. పోనీ Revenue Board వద్ద ఉన్నవా అంటే, అక్కడకూడా లేవు అందువల్ల ప్రభుత్వము ఏవిధముగ పన్ను వేయాలని అనుకున్నప్పటికినీ, తప్పనిసరిగా యిలాంటి లెక్కలు ఉండవలసిందే అయితే ఏ దృష్టితో చూచుకున్నప్పటికినీ భూమికి గరిష్టపరిమితి నిర్ణయించటానికి యిది ఉద్దేశించినా, లేకపోతే graded land surcharges వేయాలని అనుకున్నప్పటికినీ, ప్రభుత్వానికి సక్రమమైన లెక్కలు

ఉండడము అవసరమేనని మేముకూడ అంటున్నాము దీనికి మాకుగాని, మా పార్టీకిగాని ఏలాంటి భేదాభిప్రాయము లేదు.

మా పార్టీకి ప్రభుత్వానికీ యీ విషయంలో భేదాభిప్రాయం లేదు ఈ రెండు ఉద్దేశ్యాలలో యే ఉద్దేశ్యాన్ని మనస్సులో పెట్టుకుని యీ లెక్కలను తీసుకొనదలచుకున్నా అందుకు యీ బిల్లు సరిపోతుందా అంటే సరిపోదు. ఇది ఒక నిష్ప్రయోజనకరమైన బిల్లు ఉన్న భూమికి గరిష్ట పరిమితి పెట్టాలన్నా భూమినిబట్టి పన్ను రేట్లు ఎక్కువ చేయదలచుకున్నా. ఏ దృష్టితో చూచినా (యీ రోజు వాస్తవికంగా దేశంలో ఎవరెవరిక్రింద ఎంతెంత భూమివుందో ఆ వివరాలు దీనివల్ల మాత్రంరావు.) ఇదంతా తప్పించుకుని పోవడానికి మార్గంగా వుంది ప్రభుత్వం అది ఉద్దేశించినదా లేదా అనేదాంతో మాకు సంబంధంలేదు ఒకరి మనస్సులోకి వెళ్ళి చూచి మీరు యీ ఉద్దేశ్యంతోనే చేశారు అని ఆపాదించడంవల్ల ఉపయోగంలేదు వారు సదుద్దేశ్యముతోనే చేసి వుండవచ్చు. కాని దాని ఫలితంమాత్రం నెరవేరకపోగా పెడర్థానికి పెడమార్గానికి పోయేటట్లయితే యీ బిల్లు నిష్ప్రయోజన మవుతుంది గరిష్ట పరిమితినుండి తప్పించుకోడానికి, హెచ్చు పన్నులనుండి ఎక్కువ భూమిగల వారు తప్పించుకోడానికి కావలసిన అవకాశాలు యీ బిల్లువల్ల కలుగుతున్నాయి. ఆ లోపాలను అరికట్టడానికి యీ బిల్లు తోడ్పడలేదనే విమర్శ సహేతుకమైన విమర్శ ఆ రకంగా యీ బిల్లు లోపభూయిష్ట మయినది ప్రభుత్వం భవిష్యత్తులో ఎంత ceiling పెడతారు ? 20 ఎకరాలకు పెడతారా ? ఇంకా ఎక్కువ పెడతారా ? ఇంకా తక్కువ పెడతారా అనే సంగతి ceiling bill వచ్చేటప్పుడు చర్చించుకోవచ్చు. ఇప్పుడు బిల్లులో ceiling అనేది నిర్దేశిస్తున్నామా అంటే యిందులో యేమీ లేనిమాట నిజమే కొంతమంది 20 ఎకరాలుపైన తీసుకుంటారని భయపడి registration చేస్తుంటే మంత్రిగారు కూడా హామీ యిచ్చారు, "అనవసరంగా registration కు డబ్బు తగలేసుకుంటున్నారు. అటువంటి భయం వుండాల్సిన అవసరంలేదు. 20 ఎకరాలపైనుంచి లెక్కలు తీయమంటే 20 ఎకరాలే భూపరిమితి పెడుతున్నామని అనుకోవద్దు, ఇంకా ఎక్కువ పెడతాం" అనేరీతిగా వారు......

శ్రీ కె. వెంకటరావు : తక్కువ కూడా అని చెప్పాను.

శ్రీ పి. సుందరయ్య : 'అశ్వత్థామ హతః కుంజరః' అన్నట్టుగా అసలు విషయం గట్టిగా చెప్పి 'కుంజరః' అనే పదం చాలా తేలికగా చెప్పినట్లుగా

'అంతకన్నా తక్కువ పెడుతున్నాం' అనే మాట మంత్రిగారికి మనస్సులో వుంటే వుండవచ్చుగాని ఖచ్చితంగా అంత ఘంటాపథంగా రాలేదు

శ్రీ కె. వెంకటరావు వారు అర్థంచేసుకోలేదు

శ్రీ పి సుందరయ్య నాకు వినపడలేదు అందుచేత యే దృష్టితో చూచినా "20 ఎకరాలు ప్రభుత్వం పరిమితిపెట్టి అంతకు మించినదంతా తీసుకుంటామనే రీతిగా భ్రమపడవద్దు" అనే మంత్రిగారు చెబుతున్నారు కాని 20 ఎకరాలు పెడతారా అంతకుమించి పెడతారా, తక్కువ పెడతారా అనే సంగతి తరువాత ఆలోచిస్తాంగాని ఏ ceiling పెట్టినా అది సక్రమంగా అమలు జరుగడానికి కావలసిన లెక్కలయినా దాంట్లో వస్తాయా అంటే రావడంలేదు ఈ రోజువున్న లెక్కలయొక్క పరిస్థితి యేమిటో చూడండి 1953 - 1954 లో ఆంధ్రప్రాంతంలో తీసుకున్న లెక్కలు కేవలం భూఖండాలకు సంబంధించినవి మాత్రమే అన్నారు అంటే పట్టాలనుబట్టి తయారుచేసిన లెక్కలు ఉద్యోగుల దగ్గరున్నటువంటి పట్టా లెక్కలనుబట్టి ఆ పట్టాలన్నీ సమీకరింపజేసి ఈ రకంగా చేశారంటున్నారు కాని నేను మంత్రిగారిని అడగదలచుకున్నది యేమిటంటే ఆ రకంగా పట్టాలను బట్టి చేసేటప్పుడు యీ పట్టాలన్నీ ఒక State-wide గా జిల్లా వారీగా చేయడం జరిగింది కనుక దానిలోని లోపాలను పరిశీలించడానికి మార్గం చూపిస్తున్నారా ? అని. ఏ మార్గమూ చూపించడము లేదు మొత్తం పాత ఆంధ్రరాష్ట్రంలో ఎక్కడ భూమివున్నా declare చేయాలన్నారు తెలంగాణాలో ఆ ప్రాంతంవారికి భూమి వుండవచ్చు మొత్తం ఆంధ్రప్రదేశ్ లో ఎక్కడున్నా declare చేయాలని తీసుకురాలేదు ఈ చట్టం మొదటి clause లో 'It extends to the territories of Andhra Pradesh which immediately before the first September 1956 were comprised in the State of Andhra" అని వుంది ఆంధ్రప్రాంతంలో వున్నవారికి తెలంగాణా ప్రాంతంలో వున్న భూములకు లెక్కలను చెప్పమని యీ బిల్లులో వున్నదా అన్నది అనుమానాస్పదముగా వున్నది. ఆంధ్ర జిల్లాలలో వున్నవారు తెలంగాణాలో భూమి కొంటున్న విషయం మనకు తెలిసినదే. ఆ భూముల లెక్కలు యివ్వాలని యీ బిల్లు శాసిస్తున్నదని చెప్పడానికి వీలులేదు. Loopholes దీంట్లో వున్నాయి ఈ రోజు భూఖండాలున్నాయంటున్నారు భూవసతికి గరిష్ట పరిమితి పెడుతున్నామన్నారు. ఒక కుటుంబానికి వున్న భూమినంతా తీసుకొని దానికి పరిమితి పెట్టాలని ఒకప్పుడు Planning Commission సూచన చేసినది తరువాత కుటుంబానికి, వ్యక్తికే పరిమితి పెట్టాలనేదానిని రాష్ట్రప్రభుత్వాలకు

వదలినమాట నిజమే కాని ఒక కుటుంబానికి రె3600 నికరాదాయము వచ్చే దానినివుంచి దానికి మించిన భూమిని తీసివేయాలని Planning Commission యొక్క Agrarian Panel లో సూచించబడింది అందుచేత ప్రభుత్వం ceiling పెట్టదలచుకున్నప్పుడు అది ఒక వ్యక్తికి వుండాలో, కుటుంబానికి వుండాలో ప్రభుత్వం నిర్ణయించుకుందా అంటే 'యింతవరకు నిర్ణయించుకోలేదు' అని మంత్రిగారంటున్నారు నిర్ణయించుకోకపోయినప్పుడు శాసన సభలో వారు చెప్పినదానిని బట్టి రేపు ప్రభుత్వం తెచ్చే బిల్లులో ఒక కుటుంబాన్ని unit గా తీసుకొనే విషయాన్ని యింతవరకు rule out చేయలేదు Rule out చేయక పోతే రేపు ప్రభుత్వమే, "ఒక వ్యక్తిని, పట్టాదారుని కాకుండా ఒక కుటుంబాన్ని unit గా తీసుకుని భూవసతికి పరిమితి పెట్టాలి" అని అనుకున్నప్పుడు ప్రభుత్వం యింకొక Ordinance తెచ్చి కుటుంబం అంటే యేమిటో నిర్వచించి ఆ కుటుంబానికి ఎంతెంత భూమి వుందని ఆరోజున declaration అడిగి, తీసుకుని మళ్ళీ లెక్కలు తయారు చేస్తుందా? ఆ రీతిగా ఆ రోజున మళ్ళీ లెక్కలు తయారుచేయడం అంటే అర్థం యేమిటి? ఈ లెక్కలు కేవలం నిరుపయోగం అవుతాయి పోనీ ప్రతి ఒక్కరూ తనకున్న భూమి వివరాలు declare చేయాలని చెబితే రేపు అన్నీకలిపి కూడుకోవడం తప్ప యింకేమీలేదని చెప్పవచ్చు కాని షెడ్యూలులో చూచినట్లయితే అందులో ఒకరికి యింకొకరికి సంబంధం యేమీ తెలుపబడలేదు ఆయనకు భార్య అవుతుందా? కూతుర్లవుతారా? కొడుకులవుతారా? అల్లుళ్ళవుతారా? బంధువు అవుతారా? యేమి అవుతారో వివరాలు లేవు లేకపోయినప్పుడు వీటిని యే రకంగా కూడుకుంటారు మంత్రిగారు మాట్లాడుతూ ఒక ఆసామీకి ఒక జిల్లాలోనే, ఒక తాలూకాలోనే గాక రెండు మూడు జిల్లాలలో, తాలూకాలలో భూములున్నవారు చాలమంది యీ రాష్ట్రంలో వున్నారన్నారు అధ్యక్షా, ముఖ్యంగా యీ అంశము తమదృష్టికి తెస్తున్నాను అటువంటివారు చాలమంది. అంటే ఎంత సంఖ్యో మంత్రిగారికి తెలియదు వారు కొద్దిమందికాదు విస్మరింప తగినంతమందికాదు గణనీయమైన సంఖ్యలో వున్నారని మంత్రిగారు ఒప్పుకున్నారు. అంటే రెండు మూడు జిల్లాలలో, ఇంకా ఎక్కువ జిల్లాలలో భూములున్నటువంటివారు చాలమంది వున్నారు వారు చాలమంది వున్నప్పుడు రాష్ట్రంలో అంతమందికి ఎంతెంత భూమివుందో చెప్పడానికి రాష్ట్రంలో వున్న రెవిన్యూ యినస్పెక్టర్లకు, కరణాలకుసాధ్యము కాదు "కాబట్టి declaration కు మేము ordinance తెస్తున్నాం" అన్నారు, రేపు మరల యింకో ordinance తెచ్చి యింకో లెక్కలు తయారు చేయకపోతే ఒక కుటుంబానికి రాష్ట్రం మొత్తంమీద ఎంతెంత భూమి వుందో తెలియడానికి యీ లెక్కలు

ఏ రకంగా తోడ్పడతాయి ? తోడ్పడకపోతే అర్థం యేమిటి ? ప్రభుత్వం యిది వరకే ఒక నిశ్చయానికి వచ్చిందన్నమాట "మేము కుటుంబాన్ని ఒక unitగా పెట్టుకోదలచుకోలేదు ఒక్కొక్క వ్యక్తికే మేము ceiling పెట్టదలచు కున్నాము అందుచేతనే మేము కుటుంబానికి ఎంతభూమి అని కోరకుండా వ్యక్తికి ఎంతభూమి అని కోరాము. అందుకే యీ బిల్లు తీసుకురావడం జరిగింది" అని చెబుతున్నారు దానిప్రకారం మంత్రిగారు వద్దన్నా కాదన్నా. ఎక్కువ భూము లున్నటువంటివారు, "ఈ ordinance ప్రకారం కుటుం బాన్ని unit గా ప్రభుత్వం తీసుకోదలచలేదు రేపు ప్రభుత్వం. తలకు 20 ఎక రాలు పెట్టనీ, 30 ఎకరాలు పెట్టనీ, 50 ఎకరాలు పెట్టనీ ఎవరికైతే భూమి మీద వాటా వుంటుందో వారందరికి ఆ రకంగా పంచినట్లయితే యీ ceiling లోపలవుండి మనభూములుపో"వనే దృక్పథం అవలంబించి భార్యలపేర భూమిని వ్రాస్తారు, బిడ్డలపేర వ్రాస్తారు, పుట్టబోయేబిడ్డలపేర వ్రాస్తారు అనేకరకాలుగా వ్రాయడంజరుగుతుంది అందుచేతనే ఈ ordinanceరాగానేRegistration Office చుట్టూతిరిగి పాతstampలపై వ్రాయడంజరుగుతున్నది అటువంటివి జరుగుతున్న ప్పుడు మంత్రిగారు దీనిని మున్ముందైనా ఆపుచేయడానికి కావలసిన ప్రాతిపదికలు యీ బిల్లులో వేయక పోయినప్పుడు ప్రతిపక్షంవారుగాని, యితర పక్షాలవారు గాని కాంగ్రెసును విమర్శించడంలో తప్పేముంది ? ఈ బిల్లు తేవడంవల్ల యిది వరకు ఆరకంగా భూములను తమ బంధువులపేర్ల పట్టాలు యివ్వకుండా వున్న వారికందరికీ "ఇచ్చుకోండి మేము కుటుంబాన్ని unit గా తీసుకోడంలేదు వ్యక్తులనే unit గా తీసుకుంటున్నాం. మీరు పంచుకోండి ఒకవేళ మహా ప్రమాదం వచ్చినా 20 ఎకరాలపైననే మేము లెక్కలు అడుగుతున్నాం. కాబట్టి ఆలోపల లెక్కలు అడగడంలేదు కాబట్టి 20 ఎకరాలలోపల మీరు పంచుకుంటే లెక్కలు యివ్వవలసిన అవసరంలేదు. అని indirect గా చెబుతున్నట్లు అర్థం చేసుకోవచ్చు ప్రభుత్వంయొక్క మనస్సులో యేమి వుంది అనే సమస్య మాకు అవసరంలేదు దీనిభావమును ప్రజలు ఏరీతిగా అర్థం చేసుకుంటున్నారని చూచినప్పుడు తప్పకుండా "20 ఎకరాలలోపల వున్నట్లు యితే ప్రభుత్వానికి లెక్క యివ్వవలసిన అవసరంలేదు" అనే కారణంచేత Registration Office కి పోవడం బిడ్డలపేర, కూతుర్లపేర. బంధువులపేర వ్రాసుకోవడం అనేది జరుగుతోంది.

ఇట్లు వ్రాసినా కూడా యింకా అదనపు భూమి వున్నవారు అమ్ముకొం టున్నారు ముందే డబ్బంతా తీసుకొని అమ్మటములేదు 5000 ఖరీదు చేసే భూమికి వేయి రూపాయలు ముందు తీసుకొని, మిగిలిన సొమ్ముకు ప్రామిసరి

నోటు వ్రాసిఇమ్మని అడుగుకున్నారు తరువాత ఆ డబ్బు వారు ఇవ్వకపోతే కోర్టుల ద్వారా ఆ భూమిని తిరిగి ఆక్రమించుకొని ఇంకొకరికి అమ్ముకొంటా మని చెబుతారు ఆర్డినెన్సు ప్రకటించిన లగాయితు 20 ఎకరాలు దాటిన ప్రతి భూస్వామి 20 ఎకరాల లోపు వుండేటట్లు తన కుటుంబములోనివారికి వ్రాస్తున్నాడు అది ఈ బిల్లు ద్వారా నిషేధించటానికి ఏ క్లాజులోనూ తీసుకు రాలేదు సెన్సస్ లెక్కలను దృష్టిలో పెట్టుకొని ఈ చట్టం తీసుకురావటం లేదు మనకు 1947 లో స్వాతంత్ర్యం వచ్చింది "అప్పటి నుండి భూసంస్కరణలు వస్తాయేమో, భూమి అన్యాక్రాంతమైపోతుందేమోనని, భార్యల పేరో, బిడ్డల పేరో, కూతుళ్ళ పేర వ్రాసినా అది చెల్లదు ఒక కుటుంబానికి చెంది వుంటేనే చెల్లుతుంది ఈ రకంగా బిల్లుతెచ్చేదానికి ప్రభుత్వానికి ఏమీ అడ్డులేదని మంత్రిగారు చెప్పవచ్చు భార్య ఎవరో, బిడ్డలు ఎవరో, భార్యపేరున వ్రాసినా, కుమార్తె పేరున వ్రాసినా, లేక బంధువుల పేరున వ్రాసినా మావద్ద 'చిత్రగుప్తుని' లెక్కలు వున్నాయి ఎవరికి ఎంతభూమి ఎక్కడ వుందనే విషయాలు ప్రభుత్వానికి తెలుసు ఆ లెక్కలు ప్రభుత్వం వద్ద వున్నాయి మా ఇష్టం వచ్చినట్లు సీలింగు పెడతాము" అని చెప్పే అధికారం ప్రభుత్వానికి వుంది కాని అటువంటి వివరాలు ఇందులో లేవనే మా విమర్శ మన ఇష్టం వచ్చినట్లుగా 1948 నుండి రెట్రొస్పెక్టివ్ ఎఫెక్టు (Retrospective effect) యివ్వవచ్చునని మంత్రిగారు చెప్పవచ్చు కాని అది విలువలేని మాట, అర్థంలేనిమాట అవుతుంది ఈ లోపాలను సరిదిద్దటానికి ప్రభుత్వం పెట్టిన ఆర్డినెన్సు ఉద్దేశ్యం నెరవేరటానికి "ఈ వ్యక్తి" అనే మాట చాలదు 'కుటుంబము' అని వుండాలి ఒక కుటుంబమునకు ఎంత భూమి వున్నదో ఆ లెక్కలన్నీ చెప్పాలని వుండాలి ఇక land owner భూమిని ఆస్థిగా కలిగినవ్యక్తి ఈ డిక్లరేషన్ ఇచ్చేటప్పుడు తన పేర ఎంత భూమి వున్నదో, తన భార్య పేర, పెళ్ళికాని కూతుర్ల పేర, మైనర్లయిన కొడుకుల పేర, మేజర్లయినా, విడిపోకుండా సమిష్టి వ్యవసాయం చేసుకొనే కొడుకుల పేర, హిందూచట్టం ప్రకారం ముసలి తల్లిదండ్రులకు హక్కు వుంటుంది కాబట్టి వారి పేర, యింకా ఎవరైనా వీరిపై ఆధారపడిన బంధువుల పేర ఎంత ఎంత భూమి వున్నదో చెప్పమని కోరాలి. రేపు సీలింగ్ పెట్టవలసివచ్చినప్పుడు ఎవరిని మినహాయించాలనేది అప్పుడు ఆలోచించుకోవచ్చు బీద ప్రజానీకానికి కాస్తోకూస్తో భూమి ఇవ్వాలంటే, ఈ భూసంస్కరణల ఆశయం నెరవేరాలంటే ఈ రీతిగా లెక్కలు సేకరించి చట్టం తీసుకురావాలి ఇప్పుడు మా వద్ద లెక్కలు లేవు, లెక్కలు సేకరించిన పిదప సీలింగ్ తెస్తామని ప్రభుత్వం ప్రకటించింది. లెక్కలు లేవు కాబట్టి లెక్కలు లేకుండా చట్టంచేస్తే అది విలువలేనిదిగా అవుతుంది కనుక లెక్కలు సేకరించటం భూమి సీలింగ్‌కు

ప్రాథమిక చర్య అని మంత్రిగారు చెప్పారు లెక్కలుకట్టటం అనే 'ఊబి' మీద భూ సంస్కరణలు అనే 'భవనాన్ని' కట్టాలని అనుకొంటే భవనాన్ని కట్టలేము సరికదా భూసంస్కరణలను ఆ ఊబిలో ముంచివేయటము అవుతుంది కనుక ఆ విషయాలన్నీ మంత్రిగారు ఆలోచించి నా సవరణను ఆమోదిస్తారని నమ్ముతున్నాను

మరొక విషయం ఈ లెక్కలు ఆంధ్రదేశానికే కావాలి కాని తెలంగాణాలో అవసరం లేదని, తెలంగాణాలో భూ సంస్కరణల చట్టం ఇదివరకే వచ్చిందని, అది సమగ్రముగానే వుందని మంత్రిగారు చెప్పారు దానిని మేము అంగీకరించటములేదు 1950లో తెలంగాణంలో చట్టంచేసినా 1954 లో కొన్ని మార్పులు చేశారు భూమికి గరిష్ట పరిమితి వుంది 4½ కుటుంబ క్షేత్రాలు రు 3,600 నికరాదాయం రు 4,800 ఫలసాయము పరిమితి అని అన్నారు ఏ ఏ ప్రాంతముల్లో ఏ ఏ తాలూకాల్లో ఎన్ని ఎకరాల మాగాణివుంటే కుటుంబ క్షేత్ర మవుతుందో, ఎన్ని ఎకరాల మెరక వుంటే కుటుంబక్షేత్ర మవుతుందో చెప్పటానికి లాండు కమిషనును వేశారు వారు ఒక list తయారుచేసి ఇచ్చారు అందులో లెక్కలు వున్నాయి దాని ప్రకారం సెన్సస్‌లు వున్నాయి కాని ఆ సెన్సస్ వేసినప్పుడు కుటుంబక్షేత్రం అన్నారుకాని 'కుటుంబము' అంటే ఎవరో తెలంగాణా యాక్టులో నిర్వచించలేదు మితాక్షరి ప్రకారం ప్రతిఒక్కనికి వాటా వుంటుంది కాబట్టి పెళ్ళి అయినా, కాకపోయినా, బిడ్డలు పుట్టినా, పుట్టకపోయినా, మేజర్ అయినా, కాకపోయినా గర్భంలో వున్న పిండానికి భాగం వుండవచ్చు కనుక ఒక్కొక్క భాగానికి 4½ కుటుంబ క్షేత్రాలని వ్రాయటం జరిగింది కాని 'కుటుంబ క్షేత్రం' అనేపదానికి నిర్వచనం ఇచ్చారు కాని 'కుటుంబము' అనే పదానికి సరైన నిర్వచనం లేకపోవటం వలన దానికి తగిన రీతిగా భూలెక్కలు సేకరించలేదు దానివల్ల ఏ భూసంస్కరణల వల్ల పేద ప్రజానీకానికి భూమి రావాలని ఆశించామో ఆ విధంగా వారికి భూమి రాకుండాపోయే పరిస్థితులు కల్గుతున్నాయి ఖమ్మం జిల్లా విషయం చూస్తే లోప భూయిష్టమైన లెక్కల వల్ల మొదటి అంచనాప్రకారం 25,000 ఎకరాల భూమి వుందని తెలిసింది తిరిగి అంచనా వేస్తే 2000 ఎకరాల కంటె ఎక్కువ రాదని, మరీ జాగ్రత్తగా ప్రయత్నిస్తే 3000ఎకరాలకు మించిరాదని అన్నారు మిగిలిన భూమిని ఏ కాకి, ఏ పిల్లి, ఏ ఎలుక ఎత్తుకుపోయిందో తెలియదు ఏదైనా వస్తువు కోసం పిల్లలు ఏడుస్తూవుంటే కాకి ఎత్తుకుపోయిందని సమాధానం చెప్పవచ్చు. కాని అలా భూమిలేదని చెప్పినంత మాత్రాన ప్రజలు నమ్మరు ఎందుచేతనంటే, ఏఏ కుటుంబములలో ఎవరెవరున్నారు ? ఎవరికి ఎంత

భూమి వున్నదో ప్రజలందరికి తెలుసు "ప్రజలు మమ్ములను విశ్వసిస్తారు, కేవలం ధనవంతులే మాకు ఓట్లు ఇస్తే ఎన్నికలలో గెలిచేవారమా ? మధ్య తరగతి ప్రజలు, బీదప్రజలు కూడా మాకు ఓట్లు ఇచ్చారు కనుక మేము ఎన్నికలలో గెలిచామని" మంత్రిగారు చెప్పవచ్చు కేవలం ధనవంతులు ఓట్లు వేయటం వల్లనే గెలిచారని మేము అనుకోవటంలేదు బీదప్రజలు మధ్య తరగతివారు కూడా ఇచ్చారు ఓట్లనాడు- ఇచ్చిన వాగ్దానం ప్రకారం భూ సంస్కరణలు తెస్తున్నారు కాని ఈ తేవటం అనేది కన్నీళ్లు తుడవటానికే తప్పితే యింకా 4 సంవత్సరాల వరకు ఎన్నికలు రావు కాబట్టి మరల ఎన్నికలు వచ్చేవరకూ ఇలాగే జరుపుతూ వస్తారా ? లేక భూమిలేనివారికి భూమి ఇచ్చేదానికి భూమికి, ఇతర ఆదాయములకు పరిమితి పెట్టాలనే విషయం మనసులో వుంచుకొని అది అమలు లోనికి వచ్చేరీతిగా ఈ ప్రభుత్వంవారు ఈ చట్టం చేయబోతున్నారా అనేది మా ప్రశ్న

ఈరీతిగా చూచినప్పటికీ కూడా తెలంగాణాలో కుటుంబం అంటే ఏమిటో సరైనలెక్కలు లేవు. అందుచేత యీ చట్టంవల్ల నిజంగా భూసంస్కరణలు తీసుకురాదలచుకొంటే కూడా ఆంధ్ర, తెలంగాణా లెక్కలు అని రెండుముఖాలుగా వెళ్ళడం సాధ్యంకాదు తెలంగాణాలో యిదివరకు చేసిన సంస్కరణలలో వున్న లోపాలను తొలగించాలి తెలంగాణాలోనూ ఆంధ్రలోనూ ఒకేరకమైన భూసంస్కరణలు వర్తింపచేయాలి భూసంస్కరణలవల్ల పేదప్రజానీకానికి—భూమిలేనివారికి కాస్తో కూస్తో భూమిరావడానికి అవకాశం కలిగించేందుకు మనం చట్టాన్ని సవరించవలసి వుంటుంది దీనికి కావలసిన లెక్కలు సేకరించేటప్పుడు తెలంగాణా చట్టాన్నికూడా సవరించవలసి ఉంటుంది. తరువాత మాట్లాడేసభ్యులు ఏ ఏ ప్రాంతాలలో ఏయే తాలూకాలలో ఎవరెవరి పేర వ్రాసినదీ, పుట్టిన బిడ్డపేర వ్రాసినదీ, పుట్టబోయే బిడ్డపేర వ్రాసినదీ వివరాలు చెబుతారు అధ్యక్షా, శాసనసభ్యులందరూ, రెవిన్యూ మంత్రిగారు, ముఖ్యమంత్రిగారితోసహా M L A. సినిమాకు వెళ్ళినాము. పాపం, కొడుకుపుడతాడనే ఉద్దేశంతో, పుట్టబోయే కొడుకుపేర ఆ సినిమాలో ఒకడు వ్రాసేశాడు. ఆఖరికి కూతురుపుట్టినది. ఇంకా వాడు లబోలబోమని గోలపెట్టినాడు కూతురుపుడితే, పెండ్లి చేయవలసివస్తుంది కట్నాలు యిచ్చుకోవలసి వుంటుంది. అతని ఏడుపు అదికాదు తీరా కొడుకుపేర వ్రాస్తే కూతురు పుట్టినదే, యీ registration చెల్లదేయని అతడు ఒక పేగోల. ఇది కేవలం ఊహించిన కథ అనేక ఊహలతో చిత్రించాడనుకోండి. కాని ఆపంగతి మాత్రం నిజము. బయట ప్రపంచంలో జరుగుతున్న వాస్తవికత యిది. అందు

చేత యిటువంటివాటిని తొలగించడానికి మంత్రిగారు యీ చట్టంలో ఏమైనా చేస్తున్నారా అంటే లేదు ఏ కారణంతో చూచినా తెలంగాణాకు కూడా యీ చట్టాన్ని వర్తింపచేయడం లేదు ఈ సందర్భంలో తెలంగాణాలో రు॥ 3,600 లు నికరాదాయం వచ్చే భూమిని మించినభూమిని కూడా తీసుకోవలసి వుంటుంది నికరాదాయం లెక్కలు వేసేటప్పుడు పండిన పంటలో సగం ఖర్చులకు పోతాయి కాబట్టి ఫలసాయంలో సగం మాత్రమే నికరాదాయంక్రిందకు వస్తుందంటున్నారు అది సరైనదాఅంటే అన్నిప్రదేశాల లోనూ సరైనదికాదు బావులక్రింద ఇంక యితరఅనేకవిధాలుగా వ్యవసాయం చేసేచోట్ల కూడా సమానంగాపండినపంటలో సగం వ్యవసాయ ఖర్చులకు అయి పోతుందనేసంగతి సరైనదికాదు అందుచేత తెలంగాణాలో భూసంస్కరణలన్నీ సక్రమంగా ఐపోయాయి, చాలా సంతృప్తికరంగా ఉన్నది, ఈచట్టాన్ని అమలు చేస్తే తెలంగాణాలోని బీదప్రజలకు కాస్తోకూస్తో భూమివస్తుంది అనే భ్రమలు మానేయాలి తెలంగాణాలో చేసిన భూసంస్కరణల చట్టంకూడా కండ్లుతుడిచే దానికి ఉపయోగపడుతుంది తప్పితే, యింకెక్కువగా ఉపయోగపడడం లేదు. అందుచేత ఈచట్టంలో వుండే లోపాలను తొలగించి, ఆంధ్ర ప్రాంతంలోకూడా భూసంస్కరణలకు ఒకపరిమితిచట్టం తీసుకురావలసినఅవసరంవుంటుంది, కాబట్టి, దానికి కావలసిన లెక్కలు సేకరించడం ప్రధానోద్దేశ్యంగా పెట్టుకొని మంత్రి వర్గమూ, ప్రభుత్వమూ యీ బిల్లు తెచ్చినప్పుడు యీ లోపాలను సవరించడం అవసరం లేకపోతే, యీ బిల్లు అంతా నిరుపయోగ మవుతుందని చెప్పవలసి వుంటుంది ఈ రోజున మంత్రిగారు ఉద్దేశించినా, ఉద్దేశించక పోయినా ఆంధ్ర ప్రాంతంలోనూ, తెలంగాణలోనూ కూడ భూములు అన్యాక్రాంతాలు అయి పోయినాయి అన్యాక్రాంతం అంటే మరే ఉద్దేశ్యంతోనూ కాదు వారసులకు వ్రాసి యివ్వడం, కూతుళ్ళపేర, కొడుకులపేర వ్రాయడం అన్యాక్రాంతం కాదు, కాని మేము స్త్రీ పురుషులకు సమానహక్కులు కావాలనేవాళ్ళము అందుచేత ఆ రకంగా ఆస్థిని పంచుకుంటే మాకు అభ్యంతర మేమీలేదు కాని మనం భూమికి పరిమితి పెడుతున్నాము. అంతకంటె ఎక్కువభూమి వున్నవారి దగ్గరనుంచి కొంతభూమి తీసికొని భూమి లేని పేదలకు యివ్వాలని చట్టం చేస్తుంటే కేవలం దానిని తప్పించుకోడానికి గాను కూతురుపేర కొంత, భార్య పేర కొంత, పుట్టిన బిడ్డపేర కొంత, పుట్టబోయే బిడ్డపేర కొంత యీ విధంగా తలోకాస్త వ్రాసేసి, మేము యీ చట్టం క్రిందికి రాము అనేపద్ధతి ఉన్నప్పుడు, చేయదలచుకొన్న దానిని త్రోసిపారేయడానికి తప్పుడుమార్గం పట్టడానికి కుట్రలు జరుపుతున్నప్పుడు వాటిని అరికట్టడానికి ప్రభుత్వం తగినచర్యలు తీసుకోవలసి వుంటుంది. ఇదివరకు ఎప్పుడూలేని తొందర యిప్పుడు

ఎందుకు వచ్చింది ? మన Registration Office వద్ద కూడా 'ఈనాడే రిజిష్టర్ చేయాలి, ఈనాడే రిజిష్టర్ చేయాలి' అని పాతస్టాంపులు తెచ్చుకొని రిజిస్ట్రేషన్ చేయించుకోవలసిన ఆదుర్దా ఎందుకు పుట్టింది ? ఏదో చట్టం రాబోతోంది, మన భూములు మన చేతిలోనుంచి పోబోతున్నాయి, ఏదో నష్ట పరిహారం యిస్తారనుకోండి, బాండుల రూపంలో యిస్తారు, ఎన్నాళ్ళలో యిస్తారో, ఏమిటో మన చేతిలోంచి భూమి పోతుంది ఎకరానికి 18, 20 బస్తాలు పండేచోట 10, 15 బస్తాలు కౌలు తీసుకొనే అవకాశాలు లేకుండా పోతున్నాయి' అనే భయంతో యీ పనులన్నీ చేస్తున్నారు కౌలు చట్టంసంగతి మనందరికీ తెలుసు. సగానికి సగం యివ్వాలన్నారు ప్రతిచోట కూడా భూమిఉంటే తీసుకొని వ్యవసాయకూలీలను తొలగించడం జరుగు తోంది ఈ సంగతి మనకు తెలుసు "ఇటువంటివన్నీ రాకుండా చేయడానికి మేము లెక్కలు కోరుతున్నాము దీనికి ముందుజరిగిన అన్యాక్రాంతాలు సరే సరి, ఇంకముందు యిటువంటి అన్యాక్రాంతాలు చేసినట్లయితే మేము వాటిని గుర్తించము, బినామీట్రాన్సుఫరులను గుర్తించము" అని ఒక క్లాజు వున్నట్ల యితే బాగుంటుంది ఈ క్లాజు యీనాడే ఆచరణలోకి రాకపోవచ్చు కాని మన రిజిస్ట్రేషన్ ఆఫీసులమీద అనవసరమైన రద్దీవుండదు తొందరగా రిజిస్ట్రే షన్ చేయించుకోకపోతే రిజిస్ట్రారుకు మామూళ్ళు యిచ్చుకోవలసిన అవసరం లేకుండా పోతుంది మన ఉద్యోగస్థులమీద అనవసరమైన ఒత్తిడిలేకుండా, వారు అనవసరమైన లోపాలకు గురయ్యే కారణాలు కల్పించకుండా సక్ర మంగా జరగడానికి వీలుంటుంది అందుచేత "ఇకముందు అటువంటివి గుర్తించ బోవడం లేదని ఒకక్లాజు పెట్టితే బాగుంటుంది ఈ క్లాజు పెట్టినాకూడా ఆ స్కోపు అయినా ఒక హద్దులో వుండి, మనం అనుకొన్న పని జరగడానికి వీలుంటుంది. ఈ లోపంకూడా యిందులోవుంది. ఈ సందర్భంలోనే ఇంకొక విషయం మీ దృష్టికి తీసుకురావలసిన అవసరం ఉన్నది 1953-54 లో ఆంధ్రలో గానీ, తెలంగాణలో గాని తీసుకున్న land census లో లోపా లున్నాయి ఒక పట్టావుంటే ఆ పట్టాలో ఒకరిపేరే వున్నదా ? జాయింటు పట్టాదారు 1, 1½ ఎకరం ఉన్నటువంటి బంధువు కానటువంటి, యింకొక ఊరిలో ఉండే మనిషిపేర కూడా పట్టావుందా ? అనేది తేలలేదని సరైన లెక్కలు తెలియలేదని మంత్రిగారంటున్నారు అది చాలా చిన్నలోపము. సామాన్యంగా పెద్ద భూస్వామి ఉన్నట్లయితే అతని పట్టా వేరుగానే ఉంటుంది. Joint గా చిన్న చిన్నవారు కొద్దిగా వుంటారు. ఎక్కడో మింగివేయ దలచుకుని పెట్టుకుంటే తప్ప. సామాన్యంగా పెద్దవారితో చిన్నవారి పట్టాలు చాలా అరుదుగా ఉంటాయి. ఆచరణలో జరిగినది ఏమిటి ?

1948 లో Estates Abolition Act వచ్చినప్పటినుంచీ, భూసంస్కరణలు కావాలనే ఆందోళన దేశంలో ప్రబలినప్పటినుంచీ కూడా భూములున్న వారంతా, భూమిఅంతా ఒకరిపేర వుంటే ఎప్పటికయినా నష్టమేనని అమ్ముకున్నవికాక తమ కుటుంబంలో వున్న వారిపేర ఎప్పటికప్పుడు భూములు వ్రాయడం జరుగుతోంది ఎవరికీ దానాలు చేయడంలేదు వినోబా భావేగారికి కూడా దానం చేయడంలేదు వారికి దానం చేసేవి పండని భూములు, పోరంబోకు బంజరాయిలు, తగాదాలలోవున్న భూములు అందరూ అదేరకంగా చేశారని అనను కాని వారికి దానంచేసిన భూమిలో ఎక్కువ భాగం యిటువంటివేనని అంటున్నాను కొంతమంది కొద్దిగా చేస్తే అది మంచిది కాదని నేను అనను ఎక్కువభాగం తగాదాలలో ఉన్నాయి, అసలు లేనివికూడా కొన్ని ఉన్నాయి కుందలలో ఉన్నవీ, పోరంబోకు భూములు ఇటువంటివి ఎక్కువగా యిచ్చారు కావాలంటే యిటువంటి భూములన్నీ ప్రభుత్వం తీసుకున్నా మాకు అభ్యంతరం లేదు

అధ్యక్షా, మీరు కృష్ణా జిల్లానుంచి వచ్చారు కృష్ణాజిల్లాలో చేసిన భూదానం సంగతి మనకు తెలిసినదే నేను ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు బాగా పంటలు పండేదివి, గన్నవరం, గుడివాడ తాలూకాలలోని భూములను ఇవ్వకుండా నూజివీడు, తిరువూరు తాలూకాలలో నీళ్ళవసతి లేకుండా అడవులతోనూ, రాళ్ళురప్పలతోనిండి, వివాదాస్పదమైన భూములు 1000, 500 ఎకరాలు ఇచ్చినట్లు వ్రాశారు, మంచి భూములు 5 ఎకరాలు యిస్తేచాలు

అందుచేత భూదానోద్యమం వర్తిస్తుందా లేదా అనే సంగతి అట్లాపెట్టి దీనిని గురించి ప్రభుత్వం సరైన లెక్కలు సేకరించడం లేదని చెప్పవలసి వస్తోంది

*Sir L. Lakshmandas (Pathapatnam - General)* On a point of information, Sir అధ్యక్షా, సుందరయ్యగారికి భూదానంమీద విశ్వాసంలేదా?

*Mr. Speaker* — No point of information, please There can be no interruption.

శ్రీ పి. సుందరయ్య భూదానం చేసి. నిజమైన భూమి పేదలకు యిస్తే అభినందిస్తాము, చాలా సంతోషిస్తాము కాని అట్లా అందరూ చేస్తారని ఆశించడంలో మాత్రం నాకు విశ్వాసం లేదు. ఒకరిద్దరు తేరని అనను అట్లా

ఒకరిద్దరితో యీ భూదానోద్యమం జయప్రదంకాదు ఆరకంగా అందరూ దానం యిస్తేనే చట్టాలు లేకుండా భూ సంస్కరణలు అవుతాయని వినోబా భావే కూడా చెప్పారు దేశం అంతా వారు 7 ఏండ్లు తిరిగారు ఆఖరికి విసుగుబుట్టి యిదేరకంగా జరిగితే చట్టాలుచేసి, అందరినుంచి భూములు లాక్కోవలసి వుంటుంది- అని కూడా వారు ఒకసారి అన్నట్లు నేను పత్రికలలో చదివినట్లు జ్ఞాపకం వినోబా భావేకు ఎంతో విశ్వాసం ఉండవచ్చు, నాకు అంత విశ్వాసంలేదు, నేను వినోభా అంతటి గొప్పవాడిని కాను అందరికీ హృదయ పరివర్తన వచ్చి, కష్టపడి అంతా పని చేసుకుంటూ, భూమిలేని పేద ప్రజలకు భూములు యిస్తారనే విశ్వాసం నాకు మాత్రంలేదు

మిస్టర్ స్పీకర్ మంచిభూములు యిస్తే సంతోషమే

శ్రీ పి. సుందరయ్య ఇస్తే చాలా సంతోషం ఈ చట్టాలు చేయాలని యిక్కడ గంటలకొలదీ మాట్లాడడం ఎందుకు? చట్టాలు చేసిన తరువాత ఉద్యోగస్తులద్వారా కూడా అమలు జరుగని ఆ చట్టాలన్నీ ఎందుకు? అందరికీ తెల్లవారేసరికి హృదయ పరివర్తన కలిగి, లేకపోతే ఒక సంవత్సరానికి కలిగి భూములన్నీ పేదప్రజలకు యిస్తే సంతోషించని వెర్రిమనిషి ఎవరైనా ఉంటారా? అట్లా అనుకోకపోతే అతడు మనిషికాదు, అతనికి ఏదో జరిగింది అనుకోవలసి వుంటుంది కాని వారికి హృదయ పరివర్తన జరగలేదు ప్రభుత్వం కొన్ని గట్టి చర్యలు తీసుకుంటేనే కాని, కొంతమందికి హృదయ పరివర్తన కలగదు. అందుచేతనే ఈ చట్టాలు తీసుకురావాలి ఈ విషయాలలో కళా వెంకటరావు గారిని ఎవరో ఏదో బాధిస్తారని, నేను అనుకోను అట్లా బాధించేట్లయితే వారు ఈ చట్టాన్ని తీసుకొనిరానేరారు ఇక sub-divisions అనే వాటినికాని, అమ్మకాలు కాని, నిషేధించకుండా ప్రభుత్వంవారు జాగుచేస్తూ వచ్చారు. అంతేకాదు. ఈ లెక్కలు కావాలని అడిగినందువల్ల జరిగేటటువంటి తమాషాను చూడడానికే లెక్కలు పంపించమన్నారు. 20 ఎకరాలు ఆస్తిదాటిన అందరూ లెక్కలు ఇవ్వావలన్నారు. అసలు 20 ఎకరాల ఆస్థి ఉంటేనే లెక్కలు యివ్వాలి ఉదాహరణకు; నా పేర 18 ఎకరాలు ఉందనుకోండి, నా భార్యపేర 19¾ ఎకరాలు ఉంటుంది, నాకొడుకు పేర 19¾ ఎకరాలు ఉంటుంది పెద్ద కూతురుపేర 17¾ ఎకరాలు భూమి ఉంటుంది. ఈ రకంగా కుటుంబంలోని వాళ్ళందరి పేరనా 20 ఎకరాలకు లోపలవే భూమి ఉంటే, నేను మొత్తం కుటుంబాన్ని అదుపాచూస్తూ, నేనే వ్యవసాయం చేస్తున్నాను, నేనే manage చేస్తున్నాను.

వచ్చిన ఆదాయాన్నంతా నేనే తీసుకొంటున్నాను నేనే ఖర్చుపెట్టు కుంటున్నాను లెక్కలు యివ్వవలసివచ్చినప్పుడు నాకు దాదాపు 100, 200 ఎకరాలుండి నేను ఈ రకంగా ఎప్పుడైతే విభజనచేశానో అపుడు లెక్కలు యివ్వవలసిన అవసరం ఉండదు అందువల్ల 20 ఎకరాలకుమించి భూమిఉన్న వాళ్ళంతా లెక్కలు యివ్వాలన్నపుడు కనీసం "నీ భార్యపేర ఎంత ? నీ బిడ్డల పేర ఎంత ?" అని అడిగి ఇవన్నీకలిపితే మొత్తం 20 ఎకరాలు ఉన్నపుడే ఈ లెక్కల ఉపయోగం, కాని లేకపోతే లేదు ఈ లెక్కలను ఆ విధంగా ఇమ్మని ప్రభుత్వంవారు అడిగిఉండలేదు అందుచేత ఇందులో అది ఒక పెద్ద లోపం ఈ బిల్లును ఒకరితరువాత ఒకరు పరిశీలిస్తే ఇది నిరుపయోగకరమైనటువంటిది అనే విషయం తేలిపోతుంది కంటినీరును కొంచెం శుభ్రమైన గుడ్డతో తుడిస్తే కండ్లలోనుంచి రాకుండా పోతాయి ఇంత నిరుపయోగమైన బిల్లుతో ఎవరికళ్ళు తుడవాలనో ప్రభుత్వ ఉద్దేశం? ఏమి ఉపయోగముంటుందో చూద్దాం. లెక్కలన్నీ వచ్చేస్తున్నాయి December 21 వ తేదీనాటికి ఏవో లెక్కలు వస్తాయనుకోండి, రేపు మంత్రిగారుఆ లెక్కలను తీసి analyse చేసినపుడు ప్రత్యక్షంగా ఏమికనపడుతుంది ? 1953-54 సంవత్సరపు census లో చూపించిన భూసాంద్రత, (concentration) ఒకరిదగ్గర ఎంతో కొంతభూమి ఉందని ఆరోజు 1953_54 లో సేకరించి చూపించిన లెక్కలకు, యిప్పుడు వచ్చే లెక్కలకు చాలా తేడా ఉంటుంది. ఆ లెక్కలన్నీ ఉన్నాయి వాటిని గురించి ఇక్కడ ప్రస్తావిస్తాను ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలలో రెండింటిలోను 20 ఎకరాలను standard acres క్రింద మార్చుకొని (ఒక standard acre అంటే మామూలుగా ఒక ఎకరం మాగాణిభూమి అనుకోండి) లెఖ్ఖలు కట్టాలి ఈరకంగా ఒక ఎకరం మాగాణిభూమిని standard acre గా తీసుకొని, మెట్టభూమిగా convert చేసి చూపించారు ఈ లెక్కలకోసం సుమారు 5 ఎకరాల మెరకభూమిని ఒక ఎకరం మాగాణీభూమిగా convert చేసి లెక్కలతో చూపించడం జరిగింది ఈ లెక్కలుమాత్రం ఖచ్చితమైనవని నేను చెప్పడంలేదు ఎకరం అంటే ఒక మాగాణీ ఎకరం అని లెక్కవేస్తూ, ఆంధ్ర తెలంగాణాలలోని భూములకు compare చేసుకొని చూస్తూ ఈ లెక్కలు తయారు చేయబడ్డాయి ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల్లో మొత్తం 160 వేలమంది పట్టాదారులు ఉన్నారు "20 ఎకరాలకు దాటనటువంటివారు ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలలో మొత్తం 80 వేల కుటుంబాలవారు ఉన్నారు," అని లెక్కలు చూపుతున్నాయి. 10 ఎకరాలు దాటినవారు 240 వెల కుటుంబాలవారు, ఆంధ్ర తెలంగాణాలలో ఉన్నారని మనకు ఈ లెక్కలద్వారా తెలుస్తున్నది 20 ఎకరాలు దాటినవారు ఆంధ్రలో 50 వేలమంది ఉన్నారని 1953-54

census figures చూపుతున్నాయి నా దృఢమైనటువంటి విశ్వాసమేమిటంటే ఈ ordinance వల్ల వారికి వచ్చే లెక్కలవల్ల 20 దాటి ఉన్నవాళ్లంతా 50 వేలు కాదుకదా 5 వేలమంది, 10 వేలమంది కూడా ఉంటారేమోనని అలాంటప్పుడు ఈ లెక్కలవల్ల ఉపయోగంఏమిటో చెప్పండి ? ఈ 20 ఎకరాలు దాటినవారి సంఖ్య, 50 వేలనుంచి 5 వేలకు దిగినతరువాత ఏమి లాభం ఉంటుంది ? అపుడు ఈ లెక్కలు సరైన, లెక్కలు కాకుండా పోతాయి వాటినిబట్టి "భూసంస్కరణలకు భూమిలేదు, భూసంస్కరణలు నిరుపయోగం" అనే దానికి మాత్రమే ఇవి పనికి వస్తాయి భూమిని పంచిపెట్టేందుకు అవసరమైన లెక్కలు కావు ఇవి అందుచేతనే మేము ఇచ్చిన ఇంకొక సవరణలో కూడా "20 ఎకరాలు దాటినటువంటివారు లెక్కలు యివ్వడంవల్ల ఉపయోగం లేదు 20 ఎకరాలు అంటే 20 standard acres అని చెప్పుతారు మామూలు ఎకరాలు 20 అని భావించవచ్చు, అందులో మెట్ట ఉండవచ్చు, అది మాగాణీ కావచ్చు మెట్ట, మాగాణీ కలిసి ఉన్నచోట 20 ఎకరాలు ఉన్నట్లయితే అంతకు తక్కువవాళ్ళను మనం పీడించడం ఎందుకు ? వాళ్ళకు పన్ను రేట్లు వర్తించవు, "వాళ్ళకు భూసంస్కరణలు వర్తించవు" అని చెప్పాము మెట్ట భూమి, అడవిభూమి, పత్రభూమి, రేగడిభూమి, ఇసుకభూమి, దుబ్బభూమి అన్నీ కలిసి 20 ఎకరాలకు దాటి ఉన్నటువంటివాళ్ళు లెక్కలు యివ్వడంవల్ల ప్రయోజనంలేదు మాగాణీ ప్రాంతాల్లో డెల్టాప్రాంతాల్లో మెట్టభూమి ఒక్కొక్క తాలూకా మొత్తంమీద ఒక సెంటుభూమి కూడా లేనట్టు మనకు తెలుసు రాళ్ళు రప్పలు ఉన్నచోటకూడా, 20 ఎకరాలు చూపిస్తే ఆ లెక్కల వల్ల ఉపయోగం ఏముంటుంది ? అందుచేత కనీసం 10 ఎకరాలు మాగాణీ, లేకుంటే 20 ఎకరాలు, అదీఇదీ కలసి ఉన్నటువంటివారు భూమి లెక్కలలో చూపించాలి. Ceiling 30 ఎకరాలకు పెడదామా, 50 ఎకరాలకు పెడదామా, 20 ఎకరాలకే పెడదామా ! లేకుంటే Planning Commission సూచించిన ప్రకారం 3,600 రూపాయల నికరాదాయం వచ్చేటటువంటి కుటుంబంవారిపైన పరిమితి పెడదామా, అనేటటువంటివి తేలవలసియున్నది. అందుచేత ఏ ఏ ప్రాంతాల్లో ఏ ఏ పంటలు వేసినా, ఏమిచేసినాకూడా సంవత్సరానికి 3,600 రూపాయలు సగటున నికరాదాయం వచ్చే కుటుంబం అని లెక్కతేసుకోవచ్చును కాని లెక్కలు కావలెనన్నపుడు 20 ఎకరాలు దాటినవారి లెక్కలనే తీసుకుంటామంటే, బాగా పంటలు పండి మెరక ఏమీ లేకుండా, ఒక పంట, 2 పంటలు పండే ప్రాంతాలలో, 20 ఎకరాలు, అంతకు లోపు ఉన్న వాళ్ళభూమి లెక్కలలో లేకుంటే ఆలెక్కలు నిరుపయోగమౌతాయి. మంత్రిగారు, సమాజం అభివృద్ధిచెందే కొలది అప్పుడప్పుడు మన

సాంఘిక వ్యవస్థ ఎట్లాఉంది? ఈ ఆస్తిపాస్తులలో హెచ్చుతగ్గులు, తారతమ్యాలు పరితిని ఉన్నాయో తెలుసుకొని సాంఘికసమానత్వం కోసం, సాంఘిక న్యాయం కోసం అపుడపుడు ఎక్కువగా పన్నులు వేసేదానికి ఇటువంటిలెక్కలు అవసరం, అని చెప్పారు మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలోకన్న రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో ఈ లెక్కలు సేకరించడం ప్రధానాంశముగా పెట్టుకొని ప్రభుత్వం ఈ లెక్కలు సేకరించడానికి ప్రయత్నం చేస్తున్నారు ప్రభుత్వంవారు ఇపుడు Surcharge Bill తెస్తున్నారు Commercial crops మీద Taxation Bill తెస్తున్నారు Wet Assessment Bill తీసుకువస్తున్నారు మంత్రిగారు Revenue Commission నొకదానిని వేయబోతున్నామని, భూమి పన్ను అనేది చాలా (regressive) గా ఉంది, అది పేదలమీదే చాల ఎక్కువగా పడుతోంది వున్నవాళ్ళమీద చాలా తక్కువగా పడుతోంది, అందుచేత వీటన్నిటినీ కూడా సమన్వయంచేసి సరైన పద్ధతిలో పెడతాము, నిజంగా graded పద్ధతిలేక Income Tax పద్ధతి కావాలి'' అని వారి ఉపన్యాసంలో చెప్పారు ఒకప్రక్క ఈ విధంగా మంత్రిగారు అంటున్నపుడు దానికి కావలసిన లెక్కలు అయినా లేకుండా ప్రభుత్వము, "లోటు, లోటు లోటు" అంటూ పన్నుమీద పన్ను, taxation మీద taxation, బిల్లుమీద బిల్లుతెస్తూ మా ప్రాణాలు తీసేస్తున్నారు ప్రజల ప్రాణాలు అంతకన్న తీసేస్తున్నారు అయితే ప్రభుత్వానికి సరియైన లెక్కలు ఉన్నాయా? ఎవరిమీద ఆ పన్నులను వేస్తే ఎక్కువ బరువు లేకుండా మోయగలరో, ఎవరిమీద వేస్తే ఆ బరువును మోయలేరో, ఎవరిని మినహాయించవలసి ఉంటుందో అనేటటువంటిది చూడ్డంలేదు ప్రభుత్వం దగ్గర land gradation lists లేవు అలాంటివి లేనప్పుడు ఈ పన్నులు వేయాలను కొన్నప్పటికి ప్రయోజనం ఉండదు అలాకాకుండా ఒక వ్యక్తిపేర ఎంత ఆస్తి ఉంది? ఎంతకు పట్టాఉందని కాకుండా ఒక కుటుంబాన్ని unit గా తీసుకోవాలి. హిందూసమాజ సాంప్రదాయం ప్రకారం చేయాలి హిందూ సమాజమే కాదు, ఎక్కడైనా ఇంతవరకు, భవిష్యత్తులో కూడా - భవిష్యత్తు ఎట్లా ఉంటుందో నా ఊహకు మాత్రం అందడంలేదు- ఎపుడో చరిత్రలో ఆదిమ కాలంలో, అసలు సంఘం, కుటుంబం అభివృద్ధి చెందని కాలాల్లో, పరిణామ దృష్టిలో మనం ఏ వానరులంగానో, తరువాత అడవి మనుష్యులుగానో ఉన్న, ఆ కాలంలో తప్పితే; అందరూ ఒక కుటుంబంక్రింద జాతి అభివృద్ధిచెందుతూ వచ్చినపుడు మన నాగరికత ప్రబలిందని చెప్తున్నారు అందుచేత కుటుంబమనేది ఒక unit మంత్రిగారు సోషలిస్టు సమాజంలో కూడా కుటుంబాలు ఉంటాయి'' అని ఒక విసురు విసిరారు ఇదివరకు చాలాపర్యాయాలు విసరా

రనుకోండి, కళా వెంకట్రావుగారు కాకపోయినా యింకా ఇతరమంత్రులు కూడా విసరడం జరిగింది

కుటుంబము అన్నప్పుడు భార్య వేరు, భర్త వేరు, పెద్దవారైన బిడ్డలు వేరు, చిన్నబిడ్డలు వేరు, అని చెప్పడం సబబుకాదు బిడ్డలను పెంచి, పెద్దచేసి, విద్యాబుద్ధులు గరపి ప్రయోజకులుగా చేయడం తల్లిదండ్రుల బాధ్యత కాబట్టి కుటుంబమును ఒక యూనిటుగా తీసుకొనవలెను పన్ను కట్టేటప్పుడు భార్య పేర కొంత, భర్త పేర కొంత, బిడ్డలపేర మరికొంత, యీ విధంగా విభజించి వారంవరు వేరువేరు కుటుంబాలవారని చెప్పడం సబబుకాదు

శ్రీ యల్. లక్ష్మణదాస్ కుటుంబము అంటే ఎంతమందుండాలి ?

శ్రీ కె. వెంకటరావు సుందరయ్యగారికి కుటుంబం లేదు కళా వెంకట్రావుకు కుటుంబం లేదు ప్రశ్నవేసినటువంటి లక్ష్మణదాసుగారికి కూడ లేదు

శ్రీ యల్ లక్ష్మణదాసు వెంకట్రావుగారు పొరపడుతున్నారు అందరికి కుటుంబాలున్నాయి

మిస్టర్ స్పీకర్ కుటుంబం అంటే భార్య, భర్త, పిల్లలు

శ్రీ పి సుందరయ్య భర్త, భార్య, బిడ్డలు, ఇక వారిమీద ఆధారపడున్న బంధువులు అందరూ కలసి కుటుంబం అవుతారు

మిస్టర్ స్పీకర్ తల్లిదండ్రులు కూడ కుటుంబములోనివారే.

శ్రీ పి. సుందరయ్య తలిదండ్రులు కుటుంబంలో ఉంటే ఉండవచ్చు లేదా వేరుగా ఉండవచ్చు. కుటుంబంలో ఎక్కువమందుంటే ఎక్కువ ఆదాయం ఉండవచ్చు తక్కువమందుంటే తక్కువాదాయం ఉండవచ్చు. కాబట్టి కుటుంబాన్ని యూనిటుగా తీసుకుని యీ లెక్కలు చూడవలసియున్నది, ఇప్పుడున్న లెక్కలు సరిగాలేవు లాండు రెవిన్యూ సర్‌చార్జిబిల్లు, వెట్ ఎసెస్‌మెంట్ బిల్లు, కమర్షియలు క్రాప్సు టాక్సేషను బిల్లు, మొదలయినవాటిని పాసు చేయబోతున్నాము. వాటన్నింటి దృష్ట్యా భూకమతాల లెక్కలు సులభంగా సంపాదించవచ్చు. ఐతే భూకమతాల లెక్కలను రైతులు ప్రభుత్వానికి

తెలియచేయగలందులకుద్దేశింపబడిన యీ ఆర్డినెన్సు చాలా లోపభూయిష్టంగా ఉన్నది కుటుంబములను ఒక యూనిటుగా తీసుకొనక పట్టాదారునే లెక్కకు తీసుకున్నట్లయితే యీ లెక్కలు మనకు సరిగారావు ఒక కుటుంబానికి రూ 3,600 లు నికరాదాయంగా నిర్ణయించవచ్చని ప్లానింగు కమిషనువారే సూచించారు సాలుకు రు 3,600 నికరాదాయం రావలెనంటే 20 ఎకరాల భూముంటే ఒక కుటుంబానికి సరిపోతుంది. యీ విస్తీర్ణం ఒక సామాన్య కుటుంబానికి, అంటే, 5 గురు ఉన్న కుటుంబానికి సరిపోతుంది ఈ 20 ఎకరాల పరిమితి అనేదాన్ని హెచ్చుమంది ఉన్న కుటుంబాలకంటె తక్కువమందిగల కుటుంబాలకని నేను చెప్పడంలేదు 5 మంది ఉన్న సామాన్య కుటుంబానికి యీ పరిమితి సరిపోతుంది అంతే కాకుండా 2 పంటలు పండేటటువంటి, చెరుకు మొదలయిన వ్యాపారపంటలు పండేటటువంటి భూములు 20 ఎకరాలవరకు ఉండవలెనని నేను చెప్పడంలేదు సామాన్య మయిన సారవంతంగల భూములు 20 ఎకరాలు ఉంటేచాలని నేననుకుంటు న్నాను 20 ఎకరాలకుమించిన భూవసతిగల కుటుంబాలు మన ఆంధ్ర, తెలం గాణాలలో 80 వేలు మాత్రమే ఉన్నాయి వారివద్ద 27న్నర లక్షల స్టాండర్డు ఎకరాల భూమున్నది ఒక్కొక్క కుటుంబానికి 20 ఎకగాల చొప్పున మనం లెక్కచూచినట్లయితే యీ 80 వేల కుటుంబాలకు, 16 లక్షలెకరాలు, కావలసివస్తుంది అంటె యీనాడున్న లోపభూయిష్టమయిన లెక్కలప్రకా రంగాకూడ 11న్నర లక్షల ఎకరాలు యీ కుటుంబాలవారివద్ద అదనంగా ఉన్నట్లు తేలుతున్నది అసలు యింకా ఎక్కువగానె వీరివద్ద భూమిఉంది పట్టాదారులనుబట్టి గాక, కుటుంబాలను బట్టి లెక్క తీసుకున్నట్లయితే కనీసం మరి 10 లక్షలెకరాలైన వీరివద్ద అదనంగాఉంటుంది యీ అదనపు భూమిని భూమిలేని పేదవారికివ్వవచ్చు హెచ్చుఆస్తి ఉన్నవారిపై అదనంగా పన్ను వేయవచ్చు కాబట్టి కుటుంబాన్ని ఒకటిగా తీసుకోవలెనని కోరుతున్నాను మంత్రిగారు నా సలహాను జాగ్రత్తగా ఆలోచించి అంగీకరించవలసింది ఇప్పు డున్న లెక్కలప్రకారం చూచిన 11న్నర లక్షలెకరాలభూమి ఆంధ్ర - తెలం గాణాలలో అదనంగా ఉన్నది. ఇటువంటి భూమిని భూమిలేని పేదరైతులకు, వ్యవసాయ కూలీలకు, ఏదో కొద్దిపాటి భూవసతి ఉండి సాగుచేసుకుంటున్న ఇతర వృత్తులుకూడ చేసుకుంటున్న వారికి - చేనేత పారిశ్రామికులకు, చాకలి, మంగలి, పనిచేసుకునేవారికి - ఇవ్వవచ్చు ఈ నాడు ప్రభుత్వమునకు చెందిన 20 లక్షల ఎకరాలభూమి సాగుకు లాయికయినది ఉన్నది ఇంకొక 19 లక్షల ఎకరాలవరకయిన భూస్వాములవద్ద అదనంగా ఉన్నది. అంటె దాదాపు 42 లక్షల ఎకరాలవరకు పంచడానికి వీలైన భూమి మన ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నది

యీ అదనపు భూమిని భూమిలేని వ్యవసాయ కూలీలు మొదలైనవారికి యిచ్చినట్లయితే వారు సుఖంగా జీవించడానికి అవకాశం కలుగచేసినవార మవుతాము ఆ విధంగా చేయడంవలన కుటుంబానికి 1½ ఎకరాలవరకు మాగాణి భూమిని లేక 10, 12 ఎకరాలవరకు మెట్టభూమిని ఇవ్వవచ్చు ఆ విధంగా చేసినపుడు చిన్న రైతులు, వ్యవసాయ కూలీలు, వాటిలో పనిచేసు కుంటుంటె ఆంధ్రదేశం ఎంతో సుఖిఊంగా ఉంటుంది ప్రజలజీవన స్థాయి పెరుగుతుంది కేరళ రాష్ట్రంలో చాలినంత భూమిలేక ఆ ప్రజలు అష్టకష్టాలు పడుతున్నారు, ఐతే కేరళ రాష్ట్రంలోకంటె మనకు 7 రెట్లు అదనంగా భూమి ఉన్నది కాని జనాభాలో వారికన్న రెండురెట్లుమాత్రమే మనమున్నాం కాబట్టి భూస్వాములవద్దనున్న అదనపుభూమిని తీసుకుని వ్యవసాయకూలీలు మొదలైన వారికి దాన్ని మనం పంచిపెడితే మన రాష్ట్రం సస్యశ్యామల మౌతుంది ఇతర రాష్ట్రాలవారికికూడ ఆహార ధాన్యాలు సరఫరా చేయగలస్థితిలో మన ముంటాము ఈ అభివృద్ధిని సాధించడానికి భూసంస్కరణలు అవసరం భూ సంస్కరణలకు ప్రాతిపదికగా మనము తెచ్చిన యీ ఆర్డినెన్సులోఉన్న లోపా లను తొలగించి ఒక నూతన సమాజాన్ని ఆంధ్రలోను, యావత్ భారతదేశం లోను, నిర్మించవలసిన బాధ్యత మనపైఉంది కాని యీనాడున్న పరిస్థితులలో అటువంటి సమాజాన్ని ఆచరణలో మనము ఎంతవరకు నిర్మించగలమనేది సం దేహాస్పదమైనది భూమిలో అధికభాగము కొద్దిమంది చేతులలో ఉండుటవల్ల ఎంతోమంది జీవనాధారంలేక అలమటించవలసి వస్తున్నది కాబట్టి కుటుంబ మును ఒక యూనిట్‌గా తీసుకొని ఆ కుటుంబమునకుండవలసిన భూపరిమితిని నిర్ణయించి మిగులుభూమిని పేద వ్యవసాయదారులకు, వ్యవసాయకూలీలకు, ఇప్పించవలెనని అందుకు అవసరమైన లెక్కలను తయారు చేయించవలసినదని కోరుతూ యీ సవరణను అంగీకరిస్తారని ఆశిస్తున్నాను

మిస్టర్ స్పీకర్ ప్రతిపక్ష అభిప్రాయం సుందరయ్యగారు సంపూర్ణంగా చెప్పారు. ఇకనుంచి సభ్యులకు 10 నిమిషాలు చొ. టైము యివ్వబడుతుంది.

*శ్రీ జి. బాపయ్య (పెదకాకాని) అధ్యక్షా, ఈ ఆర్డినెన్సు గురించి నేను విశేషంగా విమర్శించదలచుకొనలేదు ఇందులో landholder అంటే ఎవరు? నలుగురు సోదరులుంటే, ఆ నలుగురికీ ఆస్థిలో హక్కు ఉంటుంది. ఆ నలుగురూ landholders క్రింద వస్తారా లేక యజమానిగా ఉండే పెద్దవారే లాండ్‌హోల్డరా? దీనికి clarification అవసరం

ఈ లెక్కలు తయారు చేసేటప్పుడు రైతులు చాలా ఇబ్బంది పడుతారు వాళ్ళకు D నెంబర్లు వగైరా తెలియటానికి అవకాశంలేదు, ఆ లెక్కలు తయారు చేయుటలో వారికి కొంత సహాయం చేయవలసి యుంటుంది తప్పు లెక్కలు తయారుచేస్తే serious punishment పెట్టారు వారికి ఆస్థి సుమారు యిన్ని ఎకరాలు ఉంటుందని తెలుస్తుంది గాని, వాటికి లెక్కలు తయారు చేయటం కుదరదు కనుక ఆ పెనాల్టీని తీసివేయాలని కోరుతున్నాను

శ్రీ కె వెంకటరావు అసలు అది ఎవరైనా యిస్తారా ?

శ్రీ జి బాపయ్య అది వేరేసంగతి రు 500 లు జరిమానా వేస్తామంటే దానికి ప్రభుత్వ నౌకర్లమీద ఆధారపడి వేస్తారు వారు తప్పులెక్కలు యిచ్చారని గ్రామస్థుల ద్వారానో, మనవద్దఉన్న లెక్కలద్వారానో తెలుస్తుంది. వారు తప్పు చేశారని తెలుసుకొనుటకు అవకాశం ఉన్న ప్రభుత్వం, లెక్కలు తయారు చేయుటలో సహాయపడాలిగాని, పూర్తిగా జవాబుదారీ రైతులమీద పెట్టి, తప్పు లెక్కలయితే జరిమానా వేస్తామంటే, అమాయకమైన రైతులు నష్టపడవలసి వస్తుంది అందువలన ఆ లెక్కలు సరిగా ప్రభుత్వ ఉద్యోగులే సేకరించి రైతులమీద పెనాల్టీ తీసివేయాలని కోరుతున్నాను

Land Reforms గురించి సుందరయ్యగారు విశేషంగా చెప్పారు ఈ బిల్లు Land Reforms గురించి ఉద్దేశింపబడిందని ఎక్కడాలేదు ప్రభుత్వంవారికి ఏ లెక్కఅయినా కావలసివస్తుంది. వారికి కావలసిన statistics తీసుకుంటారు. కాని ఇది Land Reforms నిమిత్తం పెట్టబడిందని, ఆస్తులను అన్యాక్రాంతం చేయటానికి పెట్టబడిందని అనుకొనుటకు వీలులేదు అట్లాగయితే Land Reforms వస్తాయని ఇదివరకే సర్దుకొనడం జరిగింది అందుచేత Land Reforms కోసం తెచ్చారనే చర్చను అనవసరంగా పొడిగించకుండా లెక్కలు తయారు చేయు విషయంలో రైతులకు సదుపాయం కలుగచేసే విధంగా ఆలోచించాలని కోరుతున్నాను రైతులు గ్రామంలోఉండే కర్ణం, మునసబుల వద్దకువెళ్ళి ఈ లెక్కలకోసం బ్రతిమాలటంకాకుండా, వాళ్ళు రైతులకు సహాయం చేసేందుకు instructions యిచ్చి ఆ లెక్కలు తయారు చేయించాలని కోరుతున్నాను. ఈలోగా కొంతఆస్తి బాకీక్రింద, వాటిక్రింద, వీటిక్రింద, పోవచ్చును ఈ లెక్కలు, యిప్పుడు ఆర్డినెన్సు పెట్టిన తేదీనాటికి ఉన్న ఆస్థినిగురించి యివ్వవలెనా ? లేక మూడుమాసాల అనంతరం యీ లోపలపోయిన ఆస్థిని తీసివేసి, యివ్వటానికి వీలుంటుందా ? ఇది clarify చేస్తూ land holder అంటే ఎవరో సుస్పష్టమైన నిర్వచనం యివ్వాలని కోరుతూ ముగిస్తున్నాను

శ్రీ బి కేశవరెడ్డి (గనాపూరు) అధ్యక్షా, ఈ బిల్లును నేను సమర్థిస్తూ దీనిలో నాకు తోచిన కొన్ని లోపాలు మంత్రిగారికి తెలుపదలచుకున్నాను ఈ బిల్లుయొక్క ఉద్దేశం, కేవలం లెక్కలు తీసుకొనుటమాత్రమేకాక, ఆంధ్ర ప్రాంతంలో Land Reforms తేవటానికని స్పష్టమవుతున్నది అయినప్పుడు Land Reforms కు సంబంధించిన లెక్కలు అన్నీ తీసుకొనుట మంచిది దానికి సంబంధించిన లెక్కలు ఎట్లా ఉంటవనేది యిప్పుడు ఆలోచనకు తట్టక పోవచ్చును ప్రభుత్వంకూడ యింతవరకు ఒక నిర్ణయానికి వచ్చినట్లు స్పష్టం కావటంలేదు కాని ఈ బిల్లు తెచ్చినందువల్ల ఏదో ఒక నిర్ణయానికి వచ్చినట్లు అనుమానానికి దారితీస్తున్నది అది కేవలం అనుమానమే అయి వుండవచ్చును ఏమయినప్పటికి ఈ లెక్కలు మళ్ళీ మళ్ళీ సేకరించటానికి పూనుకొనటంకంటే, కాలయాపన జరగకుండా ఉండటానికి యిప్పుడే బాగా ఆలోచించి సమగ్రమైన లెక్కలు సేకరించుటకు ప్రయత్నించవలెనని మంత్రిగారిని కోరుతున్నాను అందుకుగాను ఒకటి రెండు విషయాలు మనవి చేస్తున్నాను కొంతవరకు సుందరయ్యగారు విపులంగా చెప్పారు ఇక్కడ తెలంగాణాలో Land Reforms వచ్చి అమలులో ఉన్నాయి. కాని అవి సుందరయ్యగారు అనుకొన్నంత చెడ్డగా లేవు కొంతవరకు మంచిగానే ఉన్నవి ఇక్కడ 1950 లో ఆక్టు తేబడ్డది. ఆంధ్రప్రాంతానికి సంబంధించి ఆక్టువస్తే 57-58 లో తేగలుగుతారు అంటే తెలంగాణాలో తెచ్చిన 7, 8 సంవత్సరముల తరువాత ఈ ఆక్టు తేబడుతుంది అందుకని ఏ విషయాలైతే తెలంగాణా ఆక్టులో పొందుపరచబడలేదో, ఏ లోపాలైతే తెలంగాణా ఆక్టులో ఉన్నవో, అవి తీసివేయటానికి, చట్టం సమగ్రంగా తయారుచేయటానికి ఇప్పుడు యిందులో మనం ప్రయత్నించవలసియున్నది ఆ దృష్టితో చూస్తే కొన్ని లెక్కలు ప్రభుత్వం సేకరించవలసియుంటుంది ఆంధ్ర ప్రాంతంలో 20 ఎకరాలకు మించి ఉంటే వాళ్ళు లెక్కలు సమర్పించుకోవాలని చెప్పారు కాని ఆ 20 ఎకరాలు మాగాణా? లేక మెట్టా? స్పష్టపరచలేదు ఈ రెండురకాల భూమికి చాలా తేడాఉన్నది ఆ విషయం వెంకటరావుగారి దృష్టికి రాలేదని అనుకోను అంత పొరపాటు నేను చేయను. ఈ విషయం యిప్పుడు పొందుపరచకూడదనే ఉద్దేశంతో వారు అనుకొని యుండవచ్చును వాటి yield లో తేడా ఉన్నది కాబట్టి dry land అయితే యింత, wet land అయితే యింత, ఉన్నవారు లెక్కలు యివ్వాలని స్పష్టము చేయుట మంచిదని కోరుతున్నాను ఇవాళ ఒక ప్రాంతంలో 20 ఎకరాలు పైన ఒక సెంటు ఉన్నా, మొత్తం అంతా dry land అయినప్పటికీ అతడు లెక్కలు సమర్పించుకోవాలి. పూర్తిగా 20 ఎకరాలూ తరిభూమి ఉంటే లెక్కలు సమర్పించుకోనవసరంలేదు. ఈ లెక్కలు రేపు రాబోయే

**Land Reforms** కు సంబంధం ఉంటాయని అనుకోక తప్పదు అటువంటప్పుడు ప్రభుత్వంవారు, ఈ భూమివిషయం స్పష్టంచేస్తే బాగుంటుందని కోరుతున్నాను

రెండవ విషయం హోల్డింగ్ యొక్క **definition** తెచ్చారు ఆంధ్ర ప్రాంతంలో ఉన్న వ్యక్తులు తెలంగాణా ప్రాంతంలోకూడ, భూములు సంపాదించుకొన్నారు తెలంగాణా ప్రాంతంలో వారికికూడ ఆంధ్రప్రాంతంలో భూములు లేవని నేను చెప్పజాలను ఈ పరిస్థితులలో తెలంగాణా ఆక్టు తెలంగాణాకు, ఆంధ్రఆక్టు ఆంధ్రకు వేరువేరుగా ఉండాలా? మనము ఎంతోకాలము ఆ ప్రకారం వేరుగా ఉంచజాలము కాబట్టి ఆంధ్రప్రదేశ్‌లో నివసించే వ్యక్తులకు ఎవరికి, ఎక్కడ, ఎంత భూమి ఉన్నదో లెక్కలు తీసుకుంటే ఏమీ నష్టములేదు ఎందుకంటె, తెలంగాణా యాక్టుద్వారా పెట్టబడిన యీ నిబంధనలను, ఇక్కడ ఆస్థి సంపాదించుకొన్న వ్యక్తులు తప్పించుకోవచ్చును రేపు ఆంధ్ర ప్రాంతంలో తీసుకొనివచ్చే రిఫారమ్స్‌లోని నిబంధనలనుండి వారు తప్పించుకొనే అవకాశం ఉండవచ్చు. ఎక్కడివారు అక్కడే తప్పించుకొనే అవకాశం ఉంటే యీ యాక్టులు ఎందుకు? అటువంటి లాండ్‌రిఫారమ్స్ ఎందుకు పెట్టుకోవాలి? భూమి సంస్కరణలో కొన్ని నిబంధనలు ముఖ్యంగా ఉండాలి (1) కనిష్ఠగరిష్ఠ పరిమితి ఉండటం, (2) కన్సాలిడేషన్ చేయడానికి తోడ్పడటం (3) భూస్వాములకు, టెనెన్ట్స్‌కు మధ్య ఉన్న సంబంధాలు, రైట్స్, ఏ విధంగా ఉండాలో నిర్ణయించటం — వీటిమీద భూ సంస్కరణలు ఆధారపడి ఉంటాయి కన్సాలిడేషన్‌కైనా, భూమి పరిమితి ఏర్పాటు చేయటానికైనా, ఎవరివద్ద ఎంతభూమి ఉన్నదో లెఖ్ఖలు సేకరించటానికి మనం ప్రయత్నం చేయవలసిఉన్నది ఆ విధంగా ప్రభుత్వం లెఖ్ఖలు సేకరించాలని కోరుతున్నాను, సెక్షన్ 2-సి-లో లాండ్‌హోల్డర్ అన్నపదం డిఫైన్ చేయబడింది ఎవరిపేర ఎంత భూమి ఉన్నదో, వారే ప్రభుత్వానికి లెక్కలు ఇవ్వాలని, యీ బిల్లులో ఉన్నది నాపేర 20 ఎకరాలకంటె ఎక్కువభూమి ఉంటే, నేను డిక్లరేషన్ సమర్పించుకోవాలి నా బిడ్డలపేర ఉంటే, వారు సమర్పించుకోవాలి. నా భూమి అయి ఉండి, నా మేనేజిమెంట్‌లో ఉండి, ఏదో కారణంవల్ల బంధువులపేర పెట్టుకొంటే, ఆ బంధువులు లెఖ్ఖలు సమర్పించుకోవాలి. నాకు వంద ఎకరాలు/ఉండి, దానిని 20 ఎకరాలు చొప్పున నా కుటుంబంలోని ఐదుగురిపేర వ్రాసుకొని అమలు చేయించుకొన్నాము అనుకోండి, అప్పుడు నేను ఏమీ డిక్లరేషన్ ఇవ్వనక్కరలేదు. ఏ మాత్రం నిర్బంధం నామీద ఉండదు. ఆ భూమి నాపేర నుండకపోవచ్చు. కాని నా అనుభవములోనే, నాకు సంబంధించినవారి పేరనే, నా మేనేజిమెంట్‌లోనే ఉన్నది. కాని రేపు

వచ్చే రిఫారమ్స్, నామీద పడజాలవు కాబట్టి, లెఖ్ఖలు సేకరించటంలో ఏమి పొరపాటో నాకు అర్థం కావటంలేదు దీని విషయంలో సభ్యుల ఉద్దేశం ఏమిటో నాకు అర్థం కాలేదు కాబట్టి అంకెలు సేకరించటానికి మనం ఎందుకు వెనకాడవలసిఉన్నదని అడుగుతున్నాను అంకెలు సేకరించిన తర్వాత, ఆ అంకెలను ఏవిధంగా ఉపయోగించుకోవాలన్న అధికారం ప్రభుత్వానికి ఉంటే ఉంటుంది వాటిని ఏవిధంగా ఉపయోగించాలి ఏవిధంగా పొందుపర్చాలి, ఏ సెక్షన్‌లో వాటిని ఇమడ్చాలి అన్న ఉద్దేశం తర్వాత నెరవేరుతుంది కాబట్టి ఇప్పుడు అంకెలు సేకరించటంలో ఏ మాత్రం వెనుకంజ వేయకూడదని నేను కోరుతున్నాను. హైదరాబాదు టెనన్సీయాక్టు అని ఒక యాక్టు ఇదివరకు చేయబడింది అందులో ఒక కుటుంబకమతం గురించి ఉన్నది కుటుంబం అని అందులో ఎక్కడా చెప్పబడలేదని సుందరయ్యగారు అన్నారు కాని, గరిష్ఠ పరిమితి చేసేటప్పుడు కుటుంబాన్ని కూడా డిస్క్రయిబ్ చేశారు, ఇటువంటి సూత్రాలన్నీ లాండ్ రిఫారమ్స్‌లో ఉండగలవు వ్యక్తులను విడివిడిగా చూసి లాండ్ రిఫారమ్స్ తీసుకు రాకూడదు కట్నాల బిల్లువల్ల లాభంలేదని అందరికీ తెలిసినప్పటికీ, ఆ బిల్లు కావాలని అందరూ చెప్పారు అదేవిధంగా లాండ్ రిఫారమ్ గురించి తలంచకూడదు ఇది దేశానికి, రాష్ట్రానికి కూడ ఒక పెద్ద సమస్య లాండ్ రిఫారమ్స్ దేశంలోని ఎక్కువమంది ప్రజలకు ఉపయోగపడుతుంది కాబట్టి భూమికి ఒక పరిమితి ఉండాలని నేను కోరుతున్నాను. ఆ దృష్టితో లెక్కలు సేకరించాలని కోరుతున్నాను "ఎలియేషన్స్ చెయ్యటమా, చెయ్యకపోవటమా, ఒకరికీ ముంతఖిల్ చేసుకోవచ్చునా, చేసుకోకూడదా," అన్న విషయాలగురించి యీ బిల్లులో నిర్బంధాలు లేవు, బహుశా రేపు తీసుకువచ్చే లాండ్ రిఫారమ్స్‌లో కూడ, నిర్బంధాలు ఉండవేమోననిపిస్తోంది. ప్రభుత్వం రేపు తీసుకువచ్చే యాక్టులో ఇటువంటి నిర్బంధాలన్నీ పొందుపర్చాలి ఆవిధంగా నిర్బంధాలు పొందుపర్చకపోతే, పంచటానికి భూమి మిగలదు మావద్ద రెండువందల ఎకరాలు ఉంటే, ఏదోవిధంగా పంచుకొంటాము. కుటుంబంలోని ఎవరిపేరిట అయినాసరే, రాసుకోవటం జరుగుతుంది, లేదా ఆ భూమి అమ్ముకోవడం జరుగుతుంది "కేవలం భూమంతా విభజింపబడాలి, ఎవరిదగ్గరా ఎక్కువభూమి ఉండకూడదు" అన్నదే ప్రభుత్వ ఉద్దేశమైతే, నేను ఏమీ చెప్పలేను. అట్లాగాక, మిగిలిఉండే భూమి తీసుకొని ప్రజలకు పంచిపెట్టటమే ప్రభుత్వ ఉద్దేశ్యమైతే, భూమి విభజింపబడకూడదు అమ్ముకోవటం జరగకూడదు; అన్న, నిర్బంధాలను విధించాలి, లేకపోతే కళా వెంకటరావుగారికి ఒక సెంటు భూమికూడ దొరకదని చెబుతున్నాను. కాబట్టి

అటువంటి నిర్బంధములన్నీ, యీ బిల్లులో పొందుపరచి, సమగ్రమైన లెక్కలు ఇప్పించుకోవాలని, తమద్వారా ప్రభుత్వాన్ని కోరుతూ విరమిస్తున్నాను

*శ్రీ యన్ పి. చంగల్రాయనాయుడు (వేపంజేరి) అధ్యక్షా, మంత్రి గారు ప్రవేశ పెట్టిన యీ బిల్లును నేను బలపరుస్తున్నాను ఇప్పుడు భూసంస్కరణల ప్రసక్తిలేదు మన ఆంధ్రదేశంలో ఎవరెవరికి ఎంతభూమి ఉన్నదనే లెక్కల సేకరణ కోరకే యీ బిల్లు ఉద్దేశించబడిందిగాని, భూసంస్కరణల విషయాలు ఇందులో ఏమాత్రంలేవు దేశం మొత్తంమీద ఎంతమందికి 20 ఎకరాలు మించి భూమి ఉన్నది అన్న లెఖ్ఖలు సేకరిస్తే, ఆ లెఖ్ఖలను అనుసరించి భూసంస్కరణల విషయంలో భూమికి ఎంత పరిమితి ఉంటే బాగుంటుందనేది నిర్ణయించు కోటానికి వీలుగా ఉంటుందనే ఉద్దేశంతో ప్రభుత్వం యీ బిల్లును తీసుకువచ్చింది అయితే ఈ లెఖ్ఖల సేకరణను అనేక మంది అనేక విధాల తలుస్తున్నారు 20 ఎకరాలే భూమికిపరిమితి పెడతారేమో, మాగాణి భూమికి 20 ఎకరాలు, మెట్ట భూమికి 20 ఎకరాలే పరిమితి ఉంటుందేమోననే భయం ప్రజలలో ఉన్నది. ఈ విధంగా భయపడటానికి ఆధారంలేదు. ఈ బిల్లు ఉద్దేశం ఉత్తలెక్కల సేకరణ మాత్రమేనని మంత్రిగారు పదేపదే చెబుతున్నారు అదేవిధంగా ప్రభుత్వం తరపునకూడ పత్రికలలో ప్రకటనలు ఇచ్చినారు అందువలన, దానిని గురించి చింతించవలసిన పనిలేదు ఈ లెఖ్ఖల సేకరణప్పుడు కొన్ని ఇబ్బందులు కలుగుతాయి 20 ఎకరాలు మించి ఉన్నవారంతా లెక్కలు ఇవ్వాలని అన్నారు అనాదిగా పెద్దవారినుంచి మిగతావారికి సంక్రమించిన భూములు ఉన్నాయి. అటువంటివారికి, తమకు ఎంత భూమి ఎక్కడ ఉందో, అది ఏఏ సర్వే నెంబర్లుగల భూమో తెలియదు ఆ రైతులకు యీ విషయాలు సరిగా తెలియవు వారంతా కరణాలమీద ఆధారపడి, ఆ కరణాలు ఇచ్చే లెఖ్ఖలుబట్టి ప్రభుత్వానికి లెఖ్ఖలు ఇవ్వవలసి ఉంటుంది గ్రామోద్యోగస్తులు తప్పులెక్క ఇచ్చిన, ఆ లెక్కపైన ఆధారపడి రైతు ప్రభుత్వానికి ఇచ్చిన లెక్క తప్పు అయితే, అతనికి రు 500 జరిమానా, ఆ తప్పు సవరించబడేవరకు రోజుకు వందరూపాయలు, ఇవ్వవలసి ఉంటుంది. న్యాయానికి రైతులకు లెక్కలు ఇవ్వాలనే ఉద్దేశం ఉన్నా, గ్రామ ఉద్యోగస్థులు సక్రమమైనలెక్కలు రైతులకు ఇవ్వకపోతే, ఆ తప్పుకు రైతులు ఇబ్బందిపడవలసి వస్తుంది రైతు తనకు ఆ గ్రామంలో ఎంతభూమి ఉన్నదో లెక్కలు ఇవ్వవలసిందని కోరినపుడు, ఆ గ్రామ ఉద్యోగి అతనికి సరైన లెక్కలు ఇచ్చేటట్లు ప్రభుత్వం ఏర్పాటుచేయాలి రైతులు ప్రభుత్వానికి లెక్కలు సమర్పించుకొన్నప్పుడు, ఆ లెక్కలలో ఏదైనా తప్పు ఉంటే, అందుకు కారణం గ్రామ ఉద్యోగస్థుడేగాని, రైతు ఏమాత్రం బాధ్యుడు కాదని మనవిచేస్తున్నాను

ఆవిధంగా సవరించేందుకు ప్రభుత్వం పూనుకోవాలి రైతులలో నూటికి ఐదుగురు అయినా చదువుకొన్నవారు లేరు ఎందుకంటే, అనాదిగా వారు వ్యవసాయం మీద ఆధారపడినారు ఇప్పుడిప్పుడే రైతులు తమ బిడ్డలను చదివిస్తున్నారు అందువల్ల 20 ఎకరాలు మించి ఉన్నవారిలో చదువుకొన్న వారు లేరు వీరందరు గ్రామ ఉద్యోగస్థులమీద ఆధారపడవలసి వస్తోంది కాబట్టి యీ విషయాన్ని మంత్రిగారు ఆలోచించాలని కోరుతున్నాను భూములయొక్క విస్తీర్ణమును గురించిన లెక్కలు ప్రభుత్వమువారు రైతులను యివ్వమని కోరియున్నారు కొంతమందికి అనేక గ్రామాలలో భూములు ఉండవచ్చు ఆ లెక్కలను రైతులు కరెక్టుగా ప్రభుత్వానికి అందజేయిలేరు కాబట్టి, గ్రామాలలో గ్రామ ఉద్యోగస్థులు ఉంటున్నారు గనుక, ఆ గ్రామోద్యోగస్థులే యీ లెక్కలను ఆసామీవారీగా తయారుచేసి ప్రభుత్వానికి అందించేటట్లుగాను, అవి రైతులే యిచ్చినట్లు ప్రభుత్వము ఒప్పుకునేటట్లుగా చేయవలసిందని మంత్రిగారిని కోరుతున్నాను ప్రభుత్వము ఒక్క భూముల విస్తీర్ణమును గురించే లెక్కలు అడిగితే ప్రయోజనములేదు మిగిలిన వివరాలు అంటే, ఎవరెవరికి ఎంతెంత డబ్బు ఉన్నది, ఎవరెవరికి ఏ ఏ ఫ్యాక్టరీలలో ఎన్నెన్ని షేర్లు ఉన్నవి, వాటియొక్క విలువ ఎంత, ఎక్కడెక్కడ బ్యాంకీలలో డబ్బు ఎంతెంత నిలువచేసుకుని ఉన్నారు, ఆ డబ్బు ఎవరి పేరిట ఉన్నది, అనే వివరాలుకూడ ప్రభుత్వము సేకరించినట్లయితే, ప్రభుత్వము న్యాయముగ యీ భూసంస్కరణలను గురించి కృషిచేస్తున్నట్లు కన్పిస్తుంది ఏ వ్యక్తికైనను భూమి రూపములో ఉన్న ఆస్తియే కాకుండా, డబ్బు రూపములో ఉన్న లెక్కలనుకూడ యిప్పుడే సేకరించడము మంచిది. అవి యింకా దేనికైనా ఉపయోగించగలవు. కాబట్టి ఆ లెక్కలనుగూడ తెప్పించవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను. మా పూర్వులు అనాదిలో గ్రామాలకు చేరి, అక్కడ భూమిని నమ్ముకుని వ్యవసాయము చేసుకుంటూ జీవిస్తూవచ్చారు. మా కుటుంబములో యీనాటికినీ గూడ వ్యవసాయము జరుగుతూనే ఉన్నది ప్రభుత్వము భూసంస్కరణలు తీసుకుని వచ్చేటప్పుడు ఒక్క భూమినే కాకుండ డబ్బుకూడ లెక్కలోనికి తీసుకోవలసి వుంటుంది వ్యక్తికిగల అన్ని రకముల ఆస్తిని గురించిన లెక్కలనుకూడ తెప్పించమని కోరుతున్నాను ఇదివరలో కొందరు బుద్ధిమంతులు తెలివి అయినవారు పట్టణములకు చేరుకుని అక్కడ వారి బిడ్డలను చదివించుకుంటూనో, లేక ఏదో ఒక వ్యాపారము చేసుకుంటూనో, ఇంకను మరేవిధముగానో డబ్బు సంపాదించుకుంటున్నారు. ఈ వివరాలకు సంబంధించిన లెక్కలుకూడ సేకరించటానికి ప్రభుత్వము ఆలోచించవలసియున్నది. మంత్రిగారు యీ విషయములో తగు శ్రద్ధ తీసు

కుంటారని ఆశిస్తున్నాను సుందరయ్యగారు ఒక విషయము చెప్పారు భూసంస్కరణల విషయములో **Planning Committee** వారు ప్రతి కుటుంబానికినీ సంవత్సరము ఒకటికి 3600 రూపాయలు ఆదాయము ఉండేటట్లు పరిమితి ఏర్పాటుచేస్తే బాగా ఉంటుందని సూచన చేశారు ఈ సలహా బాగానే ఉన్నది కాని ప్లానింగు కమిటీ సభ్యులే సంవత్సరానికని కాకుండా నెలకే 3600 రూపాయల జీతము తీసుకుంటూ, రైతులకు మాత్రము సంవత్సరము ఒకటికి 3600 ఆదాయము ఉంటే చాలునని ఏవిధముగా సలహా యిచ్చారో, అది ఎంత ఆమోదయోగ్యముగ ఉన్నదో నేను చెప్పలేను బస్తీలలో వారి బిడ్డలను చదివించుకోవాలనే కోరిక రైతులకు మాత్రము ఉండదా ? అలాంటప్పుడు ప్లానింగు కమిటీ సభ్యులుకూడ సంవత్సరము ఒకటికి 3600 లు జీతముగా తీసుకుంటే బాగా ఉంటుందేమోనని నా అభిప్రాయము అటు వారైనా తగ్గించుకోవాలి, ఇటు రైతులకు అయినా పెంచాలి మనము సోషలిస్టు సమాజస్థాపన ఏర్పాటు చేసుకోవాలని అనుకుంటున్నప్పుడు, అది కేంద్రప్రభుత్వమువారే చెబుతున్నప్పుడు, ఒకరికి ఎక్కువ, యింకొకరికి తక్కువ ఆదాయము ఉండడము సోషలిస్టు సమాజ స్థాపన క్రిందకు ఎట్లావస్తుందో అర్థము కావడములేదు భూసంస్కరణలను వారేగదా సూచించింది ఇప్పుడు ప్రభుత్వము యీ భూసంస్కరణల సందర్భములో 20 ఎకరాలు, అంతకంటె ఎక్కువగ భూమి ఉన్నవారు లెక్కలు ప్రభుత్వానికి పంపవలెనని ఆదేశించింది ఈ లెక్కలు ప్రభుత్వము సేకరించింది తడవుగా ఎంత పరిమితి పెట్టవచ్చు అని అనుకున్నప్పుడు, అది న్యాయమైన విధముగ గరిష్టపరిమితి పెట్టాలి మాగాణియొక్క లెక్కలేకాదు, మెట్టభూమికి గూడ లెక్కలు అవసరము అది డెల్టాప్రాంతముగ ఉండవచ్చు, మెట్టప్రాంతముగ ఉండవచ్చు, కొన్ని భూములు సారవంతమైనవి ఉండవచ్చు— సారవంతమైనవి డెల్టా ఏరియాలో ఉన్నవని మనకు తెలుసు అయితే మెట్టప్రాంతాల సంగతి ఏమిటి ? అక్కడ భూమియొక్క విలువ, ఆదాయము డెల్టాప్రాంతముల భూములతో ఎట్లా పోల్చిచూడటానికి వీలు అవుతుంది ? డెల్టా ఏరియాలో మాగాణి 20 ఎకరాలు, అంటె, మాగాణి ఎంత సారవంతమైనదో, అక్కడ మెట్టగూడ సారవంతమైనదే. ఇక మెట్టజిల్లాలలోని భూములు అంత సారవంతమైనవి కావు గనుక అక్కడ భూ గరిష్టపరిమితి ఎంతవుండాలో ప్రభుత్వము బాగుగ పరిశీలించవలసి యున్నది. ఇన్నిఎకరాలు అని కాదు మనము లెక్కలోకి తీసుకోవలసింది, ఎకరాలు అంటె కొన్నిచోట్ల మంచిభూములు కొన్నిచోట్ల సారములేని భూములు ఉన్నవి ఎకరాలకు బదులు ఆదాయమే లెక్కలోనికి తీసుకుంటే మంచిది. అది న్యాయముకూడా, ఈ విషయము ప్రభు

త్వము తప్పకుండా పరిశీలించాలి Net income consideration లోకి తీసుకుంటే, అది ఎంతఉండాలో పరిశీలించాలి, ఇప్పుడు ఒక విషయమును గురించి నేను అడుగుతున్నాను మన మంత్రివర్యులు నెల ఒకటింటికి వెయ్యి రూపాయల జీతము తీసుకుంటున్నారు అయితే వారికి సంవత్సరము ఒకటికి ఎంత వస్తున్నది? సంవత్సరము ఒకటికి 1,21,000 రూపాయలు తీసుకొంటున్నారు అయితే ఇది net income క్రిందకు తీసుకోవచ్చును గనుక మంత్రులైనవారికి సంవత్సరము ఒకటికి 1,21,000 రూపాయలు అయితే, కష్టపడి పండించే రైతులకు 3,600 రూపాయలా? ఇందులో ఏమైనా న్యాయమున్నదా? జీతముగాక పైగా allowances వేరే వారు పట్టణములలో ఉండేవారు గనుక వారు allowances కోరుతున్నారు అయితే అటువంటి allowance రైతుకు ఎందుకు యివ్వకూడదు? రైతుకు కనీసము వారి బిడ్డల చదువుకొరకైనా, మంత్రుల బిడ్డల స్థాయిలోనైనా వారి బిడ్డలను చదివించుకోటానికి నెలకు వెయ్యి రూపాయలు యిచ్చేటట్లు ఏర్పాటు చేయవలసిన బాధ్యత ప్రభుత్వము మీద ఉన్నది రైతుబిడ్డలుగూడ మంత్రుల బిడ్డలుమాదిరి, పట్టణములో ఉండి చదువుకోవాలి గనుక, రైతుబిడ్డలకుగూడ వెయ్యి రూపాయలు యిస్తే మంచిదేమో ఆలోచించమంటున్నాను Socialist Pattern of Society అని ప్రభుత్వము ఒకవైపున చెబుతూ ఉన్నప్పుడు, ఆ principle అందరికీ ఎందుకు apply చేయకూడదు? Socialist Pattern అంటె ఒకరికిఎక్కువ ఇంకొకరికి తక్కువ ఉండకూడదుగదా! తక్కువగఉన్నవారిని ఎక్కువగఉన్నవారి స్థాయిలోనికి తీసుకునిపోవటానికి ఎవ్వరికినీ ఎలాంటి ఆక్షేపణ ఉండదుగాని ఉన్నత స్థాయిలోని వారిని క్రిందిస్థాయిలోనికి తేవడము న్యాయముగఉండదు. ప్లానింగు సభ్యుల విషయము మనదికాదు గనుక ఆవిషయము అటుఉంచండి మంత్రుల స్థాయిలోనికైనా రైతు లందరుకూడ వచ్చేటట్లుగా చూడాలి ప్రభుత్వము భూసంస్కరణలు ప్రవేశపెట్టబోతామని చెబుతూ, అందరిని కూలివారిగాచేసి, ఉన్నభూమిని కాస్తా తీసుకుని మనిషికి ఎకరము, అర ఎకరము ప్రకారము పంచిపెట్టి, మేము Socialistic Pattern of Society ని ఏర్పాటు చేయబోతున్నామని చెప్పితే ప్రయోజనము ఉండదు. ఇప్పుడు ప్రజలు ఎంత ఉన్నత స్థాయిలో ఉన్నారో, అంతకంటె పై స్థాయిలోనికి తక్కినవారినికూడ కలుపుకుని, తీసుకుని పోవటానికి ప్రయత్నించాలి. కాని ఉన్నస్థాయినుంచి తప్పించి పైవారిని క్రిందిస్థాయికి, అంటే కూలివారి స్థాయిలోనికి, తీసుకునిపోయే ప్రయత్నమే ప్రభుత్వముయొక్క ఉద్దేశ్యముగా [illegible] తోచుచున్నది. ప్రపంచములో మానవులు అని చెప్పకోటానికి, [illegible] మంచిచదువు చదివించుకుని పై స్థాయిలోనికి పోవాలని అందరు [illegible] ప్రభుత్వానికి ప్రజలలో కొందరికైనా యిప్పుడు ఉన్న

స్థాయినుంచి తప్పించడము న్యాయముకాదు అలాంటి ఉన్నత స్థాయిలోనికి లేనివారిని తీసుకుని పోవటానికి ప్రభుత్వము వేరు మార్గములు ఆలోచించాలి గాని, యిప్పుడు ప్రభుత్వము తలపెట్టే ఆలోచన మంచిదికాదు ప్రభుత్వానికి శ్రేయస్కరముకాదు ప్రస్తుతము మనముందుఉన్న యీ land census సేకరించే బిల్లునుగురించి ఒక్క విషయము చెప్పదలచుకున్నాను ఈ లెక్కలు యివ్వటానికి రైతులు గ్రామములలో వెనుకబడినవారుగా ఉన్నందున, వారు తెలివిగలవారు కాదు గనుక, వారు సరియైన లెక్కలు యివ్వలేరు ప్రభుత్వోద్యోగస్థులు, గ్రామాధికార్లు ఉంటుండగా, వారివద్దనుంచి correct గా యీ లెక్కలు ఎందువల్ల సేకరించగూడదు ? లేదా గ్రామోద్యోగస్థులు రైతునకే ఆ forms అన్ని తయారుచేసి యిచ్చేటట్లు ఏర్పాటు చేయాలి అది న్యాయముగ ఉంటుంది రైతులు యివ్వకపోతే penalty వేస్తామని అంటున్నారు గ్రామోద్యోగస్థులు, ప్రభుత్వోద్యోగస్థులు యివ్వకపోతే, ఆ penalty వారిమీదనే వేయండి కాబట్టి యీ బాధ్యత రైతులకు లేకుండా చేయాలని మంత్రిగారిని కోరుతూ విరమిస్తున్నాను

* శ్రీ కె. రాజమల్లు (సిర్‌పూర్-జనరల్) అధ్యక్షా, ఈరోజున ఏ బిల్లు మీద అయితే యీ సభలో చర్చ జరుగుతున్నదో, ఆ బిల్లు ద్వారా ప్రభుత్వము ఏ ఏ census information సేకరించదలచుకున్నదో, వాటివల్ల ప్రభుత్వానికి సరియైన లెక్కలు వచ్చే బదులు తప్పు లెక్కలే వస్తాయని నా అభిప్రాయము. అయితే మన రాష్ట్రములో నాకు తెలిసినంతమటుకు 20 ఎకరాలకు పైన ఉన్న వారు పెద్ద భూస్వాములు, జమీందార్లు కనబడుతున్నారు ప్రభుత్వము యీ బిల్లును ప్రకటించడము వల్ల దీని యొక్క అంతరార్థము ఏవిధముగ కనబడుతున్నదంటే, వాళ్ళ భూములనన్నీ తొందరగా వారి వారి కుటుంబములోని వారికి, యింకా ఎక్కువగ ఉంటే వారి ఆత్మబంధువులు, వగైరాలకు 20 ఎకరాలకు ఎక్కువ కాకుండా divide చేసుకుని లెక్కలు పంపటానికి యిది వాళ్ళకు ముందుగా ఒక warning గా కన్పిస్తున్నది ప్రభుత్వమునకు నిజముగ భూ సంస్కరణలు తెచ్చి పేద ప్రజలకు సహాయముచేయాలనే సదుద్దేశ్యమే గనుక ఉన్నట్లయితే, వారు యీ విధముగ బిల్లును ముందుగ పబ్లిషుచేయరు అసలు భూ సంస్కరణల యొక్క ముఖ్యాశయము దీనివల్ల నెరవేరకుండా పోతున్నట్లేనని, ప్రభుత్వానికి యీ విషయములో సదుద్దేశ్యము లేనేలేదని తేలుతున్నది. అలాంటి సదుద్దేశ్యము ఉండిఉన్నట్లయితే ముందుగా కావలసిన లెక్కలు సేకరించిన తరువాతనే, యీ విధముగ బిల్లు పబ్లిషుచేయవలసింది కాని అలా చేయలేదు. దీనికి మంత్రిగారు ఏమి సమాధానముయిస్తారో తెలుసు

కోగోరుతున్నాను దేశములో ఉన్న దారిద్ర్యము పోగొట్టటానికి, ప్రతివాడు సుఖముగ జీవించడానికే భూసంస్కరణలని, Socialistic Pattern of Society అని కేంద్ర ప్రభుత్వమువారు, Planning Committee వారు సూచించారు ప్రభుత్వము యొక్క యీ విధానము వల్ల, యివి రెండు కూడ నెరవేరే అవకాశము కనబడడములేదు ప్రభుత్వము యీ లెక్కల సేకరణకు బిల్లును పబ్లిషు చేయడమంటే, యిది ప్రభుత్వపక్షమున ఉన్నవారికే సహాయపడుతున్నట్లు గోచరమగుచున్నది కాని దీనివల్ల ఇది రాష్ట్రములోని పేదప్రజలకు ఎట్టి సహాయము చేకూరదు ఇదివరకు హైదరాబాదుప్రభుత్వము Hyderabad Tenancy Act pass చేశారు బిల్లును యిప్పటి మాదిరిగ ముందుగ పబ్లిషుచేశారు దాని ఫలితముగా ఎవరెవరికి ఎక్కువగ భూములు ఉన్నవో, వారియొక్క కుటుంబములో ఎంతమంది మెంబర్లు, ఆత్మబంధువులు ఉన్నారో, అంతమందికి భూములను పంచిపెట్టుకొని, వారిని తమ స్వాధీనపరుచుకుని, అటుతరువాతనే ప్రభుత్వానికి తప్పుడు లెక్కలు పంపించారు ఆ బిల్లు వారికి ముందుగ ఒక warning గా ఉపయోగపడింది హైదరాబాదురాష్ట్రములో గ్రామాలలో ఎక్కువగ భూములున్నది పటేలు, పట్వారీలకే. వీరికే ఎక్కువ భూములు, పలుకుబడి ఉన్నది. వారు తప్పుడు లెక్కలు పంపినందున ఎక్కువ లాభించలేదు. అదే మాదిరిగ యిప్పుడుకూడ పెద్ద భూస్వాములకు యిది ఒక warning గా ఉపయోగిస్తున్నది 20 ఎకరాలు, అంతకంటె ఎక్కువగ భూములు ఎవరెవరికి వున్నవో వారు లెక్కలను submit చేసేబదులు, ప్రభుత్వం వద్ద యీ లెక్కలు లేవా ? ప్రభుత్వపరంగా ఉన్న Land records ను బట్టి యీ లెక్కలు వారి Revenue Board ద్వారా సేకరించవచ్చు ప్రభుత్వోద్యోగస్థులు, గ్రామాధికార్లు ఉండగా, వారిద్వారా యీ లెక్కలు ఎందుకు సేకరించి ఉండకూడదు ? కాబట్టి యీ విధానము వల్ల ఏమీ ప్రయోజనము ఉండదని స్పష్టపడుతున్నది ప్రభుత్వము Socialistic Pattern of Society స్థాపించవలెనని అంటున్నారు దానికనుగుణ్యంగా భూసంస్కరణలు అంటున్నారు. Socialistic pattern అని అంటే, నాకు కొద్దిగా అనుమానం కలుగుతున్నది Socialistic Society అంటే అది దీనితో అయిపోయిందన్నమాట Pattern అంటే, ఇదే వారి pattern అని అర్థము ఇప్పుడు యీ బిల్లు పబ్లిషుచేశారంటే, Socialist సమాజ స్థాపన నెరవేరే అవకాశము లేకుండ చేసినట్లే ఇలాంటి అవకతవక బిల్లు ముందుగ ఎందుకు పబ్లిషుచేయాలి? లెక్కలు మాత్రము రైతులు యిస్తారుకాని అవి సరియైనవిగా ఉండవు పెద్ద పెద్ద భూఖండములు గల భూస్వాములు, జమీందార్లు పేదప్రజలకంటె తెలివైనవారు అందులో గ్రామ క్షేత్రసంబంధార్లుగా ఉన్నవారు, భూస్వాములుగా ఉన్న వారు పటేల్, పట్వారీలు ఎక్కువ తెలివితేటలతో మారుమారుగా

లెక్కలు తయారుచేయడములో పరిపూర్ణ పాండిత్యముగలవారు అలాంటివారి వద్ద నుంచి సరియైనలెక్కలు ప్రభుత్వము సేకరించగలదాఅని నా అనుమానము ఏ లెక్కలు అయితే యిస్తారో, అవిఅన్నీ తప్పులే సరియైనవి యివ్వనేయివ్వరు వీటిని check చేసేది ఎవరు ? ప్రభుత్వము నిజముగ Socialist pattern of Society స్థాపించాలని ఉద్దేశిస్తున్నట్లయితే పటేల్ పట్వారీలు ఇచ్చిన లెక్కలను పరిశీలింపజేయాలి కాబట్టి ప్రభుత్వం కొంత శ్రద్ధతో యీ విషయమును బాగా ఆలోచించి, క్రమపద్ధతి ద్వారా సరైన లెక్కలను సేకరించి, నిజముగ పేద ప్రజలకు లాభము కలుగజేయాలనే ఉద్దేశ్యముతో ఉండి, సరియైన పద్ధతిలో పేదవాళ్లకు సహాయము చేయవలసిందిగా కోరుతున్నాను

* షేక్ మౌలా సాహెబు (ఉదయగిరి) : అధ్యక్షా, మంత్రిగారు ప్రతిపాదించిన యీ బిల్లును నేను బలపరుస్తున్నాను ఈ నీటితీరువ వగైరాలు సక్రమమైన మార్గములో వేయబడడములేదు ఇందుకు చాలా విచారము వేస్తున్నది ఎక్కడెక్కడ ఉన్న నీటి వసతులబట్టి ఆయా విధముగ పన్ను వేయక పోవడమునకు నాకు చాలా చింతగా ఉన్నది ఇది సక్రమమైన మార్గములో వేయాలని మంత్రిగారిని కోరుతున్నాను ఆ చింతను మంత్రిగారు జవాబులో కొంతవరకు తీర్చారు భూమిపై లాండ్ రెవిన్యూ, నీటితీరువ ఒకే విధముగ విధించడము జరుగుతున్నది (Interruption)

మిస్టర్ స్పీకర్ పన్నుల విషయమునకు, యీ బిల్లుకు సంబంధములేదు ఈ బిల్లును గురించి మాట్లాడండి

శ్రీ షేక్ మౌలాసాహెబు అదేనండి Land Revenue లో enhancement చేసే బిల్లు గనుక యీ విషయమును మాట్లాడుతున్నాను.

మిస్టర్ స్పీకర్ అది ఈరోజున కాదు ఆ బిల్లు అయిపోయింది ఇప్పుడు Land census ను గురించిన బిల్లు వచ్చింది గనుక, దానిని గురించే మాట్లాడవలసియున్నది

శ్రీ షేక్ మౌలాసాహెబు : Land census లెక్కలు సేకరించడము అనేది చూస్తే 20 ఎకరాలు అంతకంటె పైన ఉన్న భూస్వాములు, రైతులు లెక్కలు ప్రభుత్వానికి అందజేయవలెనని ప్రభుత్వము ప్రకటించారు లేకపోతే penalty అన్నారు ఈ లెక్కలు రైతులు యివ్వలేరు గనుక, ఆ బాధ్యత వారి

మీద పెట్టడము సమంజసముగలేదు ఈ లెక్కలు తయారుచేయగల విద్య, శక్తి సామర్థ్యములు వారిలో చాలామందికి లేవు ఇవి తయారుచేసుటానికి వారు గుమాస్తాలను కూడ పెట్టుకోవలసిఉంటుందేమోనని నాకు అనుమానముగ ఉన్నది అందువల్ల యిటువంటి penalty లకు బాధ్యత వారి మీద పెట్టతగదు అందువల్ల రైతులవద్ద నుంచి వసూలుచేసిన పన్ను వగైరాల సొమ్ముతో ప్రభుత్వము తమ ఉద్యోగస్థులను పోషిస్తున్నది. ప్రభుత్వము తరఫున గ్రామాధికార్లు ఉంటున్నారు గనుక, యీబాధ్యత వాళ్లమీదనే పెట్టితే సమంజసముగఉంటుంది గాని రైతులమీద పెట్టడము న్యాయముకాదు కాన రెవిన్యూ అధికార్లమీద పెట్టవలెను

అదిగాక 20 ఎకరాలు లెక్కనివ్వాలనే యీ ordinace సమంజసముగా లేదు రైతులలో ఆందోళన కలుగజేస్తున్నది నిజముగా నేడు బీదప్రజలెన్నో ఆశలు పెట్టుకుని వున్నారు వారి ఆశలు నిరాశలవుతాయని నా నమ్మకము, ఎందువల్లనంటే భూ సంస్కరణలు అనే పద్ధతి జరుగుతుందా ? జరిగేటట్లయితే యీ ceiling పనికిరాదే తలకు యింతని చెబితే అది నిజముగా కుటుంబానికి కాక వ్యక్తిగతంగా అయితే న్యాయంగా ఉంటుంది, కాని ceiling, ceiling అని పదేపదే అనడంవల్ల ప్రజలలో లేనిపోని ఉద్రేకమునకు, దుష్ప్రచారానికి దారి తీస్తుందేమో, అది చేయుటకంటె మొత్తంమీద బంజరభూములనైనా బీదలకు ఇప్పిస్తే చాలు కాని యీఆశలు పెట్టవద్దు దీంట్లోవున్న యదార్థం వెంటనే ప్రజలకు చెప్పడం మంచిది. ఇందువల్ల అనేక కుటుంబాలలో చచ్చిన వాళ్ళను బ్రతికిస్తున్నారు, Registration చేస్తున్నారు ఈ రకమైన కష్టాలకు గురవుతున్నారు రైతు ప్రభుత్వానికి ఎంతో సహాయకారిగా అండగా వున్నాడు. ప్రభుత్వం వేసే అన్నిరకాల శిస్తులకు బాధ్యుడై ఓర్పుతో చెల్లిస్తున్నాడు. సమ్మెలు చేస్తామని ప్రభుత్వాన్ని బెదిరించలేదు ప్రభుత్వం పైని తిరుగుబాటు చేయలేదు సమ్మెలు అనే ఇతర ప్రభుత్వశాఖలవలె రైతును కూడా ప్రభుత్వం గుర్తించవలసిన అవసరం వున్నది ప్రభుత్వంనుండి రైతు వేరుపడకుండా, ప్రభుత్వానికి రైతు దూరం కాకుండా వుండేటట్లు చూడవలసిన బాధ్యత ప్రభుత్వంపైన వున్నది అందువల్ల "ఈ 20 ఎకరాల పరిమితి అమలు జరపడానికి తలపెట్టలేదు కొన్ని లెక్కలు సేకరించడానికి మాత్రమే తలపెట్టాము. కాబట్టి మీరు ఆందోళన చెందవలసిన అవసరంలే"దని ప్రభుత్వం తిరిగి ఒక ప్రకటనచేస్తే బాగుంటుంది. అదిగాక డెల్టా ప్రాంతంలో రెండుకార్లు పండే భూమికి సీలింగు 20 ఎకరాలుంటే మెట్టప్రాంతంలో ఆ దామాషాను బట్టి అదే ఆదాయము రావడానికి ఎన్నివందల ఎకరాలుండాలనే సంగతిని గుర్తించి

కరువు ప్రాంతాలను దృష్టిలో పెట్టుకుని, యీ ordinance లో వుండే రహస్యమును అందరికి తెలియజేయడము అగత్యము లేకపోతే దుష్ప్రచారకులు ప్రభుత్వాన్ని విమర్శించడానికి కొంత ఆస్కారము కలుగుతుంది లేనిపోని అపోహలకు దారితీస్తుందని సందేహిస్తున్నాను అటువంటివి లేకుండా చేయాలి అయితే యిప్పుడు ordinance గురించే మాట్లాడుతున్నారు Ordinance భూమికి సంబంధించినది అయినా భూమికి సంబంధించిన పన్నులు, వాటరు రేటు మొదలగు విషయాలు యిప్పుడు వద్దంటున్నారు కాబట్టి ముగించుచున్నాను

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా, మంత్రిగారు లేరు ఏమి మాట్లాడనండి ?

సాంఘిక సంక్షేమ శాఖమంత్రి (శ్రీ డి. సంజీవయ్య) నేనున్నానండి

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య శ్రీ సంజీవయ్యగారు లేరనికాదు శ్రీ వెంకటరావుగారే వుంటే మేము చెప్పినది వినడానికీ, వారు జవాబు చెప్పడానికీ అవకాశం వుంటుంది

శ్రీ డి. సంజీవయ్య అన్నీ వ్రాసుకుంటాము వారికి తెలియజేస్తాము.

మిస్టర్ స్పీకర్ వారు వచ్చిన తరువాత శ్రీ గోపాలకృష్ణయ్యగారు మాట్లాడవచ్చు నిబంధనల ప్రకారం ఏ మంత్రి అయినా వుండవచ్చు

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య దానిని అభ్యంతర పరచలేదు

*శ్రీ గోపిడి గంగారెడ్డి (ముధోల్). అంటే మిగతాసభ్యులు మాట్లాడినది అంత ముఖ్యం కాదనీ వారు మాట్లాడితేనే రివిన్యూమంత్రిగారు వుండాలంటే అది discrimination అవుతుందేమో చూడండి

మిస్టర్ స్పీకర్ కాదు.

శ్రీ గోపిడి గంగారెడ్డి అధ్యక్ష మహాశయా, ఈ ordinance మీద చర్చలు జరుగుతున్నవి. దీనిని బలపరచాలనే యిష్టం నాకు లేదు నేను

చిన్నపుడు చదువుకుంటూ వుండే రోజులలో మా బడిపంతులుగారు ఒక పాఠం చెప్పినారు, "అబ్బాయి, నెమరువేసే జంతువులగిట్టలు చీలివుంటాయి" అని గిట్టలు చీలివున్న జంతువులన్నీ నెమరువేస్తాయని మేము అనుకున్నాము ఒక మాసంరోజులు మా యింటిప్రక్కన కూర్చుని చూచాను ఒక జంతువు గిట్టలు చీలివున్నాయి, కాని నెమరువేయడం లేదు నేను రెండు మూడు గంటలు చూచాను ఆజంతువు నెమరువేయడంలేదు, గిట్టలు మాత్రం చీలివున్నాయి అదేవిధంగా యీ ordinance తీసుకువచ్చినా అది అమలులో వుంటుందా అంటే, వుండేటట్లులేదు

శ్రీ డి సంజీవయ్య ఆజంతువు పేరు యేమిటి ?

శ్రీ గోపిడి గంగారెడ్డి ఆజంతువు పేరు "ఊరపంది" లని అంటారు పంది గిట్టలు చీలివుంటాయిగాని నెమరువేయదు అయితే అదేమొత్తరుగా కొన్ని ordinance లు, కొన్ని బిల్లులు వస్తాయి అవి నామకార్థమే కాని అమలులోకి రావు ఇదిమాత్రం నిజము రివిన్యూమంత్రిగారు లెక్కలు తీసుకోవలెనని చెప్పినప్పుడు నాకొక ఉర్దూ సామెత జ్ఞాపకమునకు వస్తున్నది,

بغل میں بچہ نگر میں ڈھنڈورا

అయితే వారిదగ్గరనే యీ లెక్కలన్నీ ఉండగా ఎందుకు లెక్కలు అడుగుతున్నారో నాకు అర్థం కాలేదు తెలంగాణాలో రెవిన్యూ శాఖకుచెందిన రాజనీతివంటిది ఆంధ్రలో లేదా అని నా అనుమానం. ప్రతి గ్రామంలో record వుంటుంది ఎవరికి ఎంత భూమివున్నదో తెలుస్తుంది. సర్వే నంబరు కలిగిన భూమియొక్క పట్టాదారుడు గ్రామంలో వుంటాడా ? పాయికారుగా వుంటాడా అనేది తెలుసును తెలిసినప్పుడు ఆయన సరిగా లెక్కలు యివ్వవచ్చు. ఇవ్వగలిగినప్పుడు రైతును ఎందుకు నిర్బంధపెట్టి లెక్కలు చూపించమని అడగాలి ? ఎక్కువ భూమిగలవాళ్ళను "జాగ్రత్తరా, బిడ్డా" అని హెచ్చరిక చేయడానికే పనికివస్తుందిగాని లెక్కలకొరకే అంటే ఎన్నడూ ఒప్పను. నిద్రలో వున్నవారిని మేల్కొలిపే సూచనలవలె ఈ లెక్కలు కోరే ఆర్డినెన్సు వున్నది. ఈ లెక్కల నమూనా చాలా చమత్కారంగా ఉన్నది. లెక్కలు సరిగా చూపించనివానికి 500 రూపాయలు జరిమానా అని వున్నది. లెక్కలు సరిగా చూపించినాడో లేదో చూచుకోవలసి వున్నది. అప్పుడు ఎందుకని యింత సమయమును వ్యర్థపుచ్చాలి ? ఇప్పుడే వాటినన్నిటిని చూచుకుంటే కూర్చుండరాదా ? 20 ఎకరాల భూమికంటె తక్కువ చూపించినాడని సాక్ష్యము చూపించుటకు అప్పుడు కూడా ప్రభుత్వము పని చేయవలసి వస్తుంది. నిజముగా

చెప్పినాడా లేదా ? ఏ గ్రామంలో ఎంతుంది ? ఇదంతా లెక్క పెట్టి చెప్పవలసి వస్తుంది గ్రామోద్యోగులకు ఒకవేళ తెలియకుండా వుంటే గ్రామంలోవున్న వారు చెప్పాలి జిల్లాలవారీగా మళ్ళా ఎట్లా తెలుసుకోవాలి 20 ఎకరాల కంటె ఎక్కువ వున్నవారు ఎక్కువ చూపించినట్లయితే మరల పటేల్ పట్వారీలకే పని చెప్పాలి రైతులు లెక్కలు చూపించాలని చెప్పుట కేవలం లెక్కల కొరకు కాదు ఎక్కువభూమి వున్నవారిని, "మీరందరు దీని లోపల జాగ్రత్తగా వుండాలి" అని హెచ్చరించడానికని ఉద్దేశించినట్లు కనపడుతున్నది ఈ లెక్కలు పటేల్ పట్వారీల పరంగా చూపించవలసి యున్నది పటేల్ పట్వారీలకు తమ రికార్డులద్వారా పట్టాదారు గ్రామంలోవున్నాడో లేదో తెలుస్తుంది గ్రామంలో లేకపోతే అతని నివాసస్థానం తెలుస్తుంది అక్కడికి ఆయనకున్న భూమి యొక్క వివరాలు పంపించాలి ఆ విధముగా ఏ జిల్లాలోవున్నా ఎంతభూమి ఆయనకున్నదో తెలుస్తుంది అందుచేత యీ బాధ్యత రైతులపైన ఉంచక, పటేల్ పట్వారీలనే బాధ్యులుగా జేసి వారే యీ records పంపాలని చెబుతూ యింతటితో ముగిస్తున్నాను

శ్రీ జి రామస్వామిరెడ్డి (పెదకూరపాడు) అధ్యక్షా, ఈ ఆర్డినెన్సు గురించి చాలామంది గౌరవసభ్యులు అనేక వివరాలను చెప్పారు కాని ఈ ఆర్డినెన్సు యొక్క ఆవశ్యకత ఏమిటో నాకు అర్థంకావటములేదు ఈ ఆర్డినెన్సు రైతులను దిగ్భ్రాంతులను చేసింది వారిలో లేనిపోని ఆందోళనను, అలజడిని కల్గించింది యుద్ధపు రోజుల్లో వచ్చే ఆర్డినెన్సువలె 'మార్షల్ లా' మాదిరిగా శాసనసభ వున్నప్పటికి, ఈ ఆర్డినెన్సు ఇలా ప్రకటించటం అమాయకులైన రైతులకేకాక, సామాన్యముగా కొద్దో గొప్పో జ్ఞానము కలిగి యున్నవారికి కూడా ఆశ్చర్యాన్ని కల్గించింది త్వరలో శాసనమును తీసుకువచ్చే ఉద్దేశ్యములో త్వరగా ఈ లెక్కల సేకరణను ప్రారంభించి యుండవచ్చు కాని ఇది రైతులలో బ్రహ్మాండమైన అలజడి తీసుకువచ్చింది లెక్కల సేకరణలో అనేక సాధక బాధకాలు వున్నాయి గ్రామాలలోవున్న రైతులు లెక్కలను ప్రభుత్వానికి అందజేసే పరిస్థితులు అంత అనుకూలముగా లేవు గ్రామములలో కరణములు వుంటారు వారు ఒక పార్టీకి, ఒక వర్గానికి చెందినవారైతే రెండవపార్టీకి, రెండవ వర్గమునకు చెందిన రైతులకు లెక్కలను సకాలములో ఇస్తారా లేదా అనేది అనుమానంగా వున్నది శ్రీ చెంగల్రాయ నాయుడుగారు చెప్పినట్లు ఈ బాధ్యత కేవలం రైతులమీదనే కాక గ్రామకరణములమీద, మునసబుల మీద వుంచాలి. ఉంచినట్లయితే లెక్కలను రైతుల సమక్షములో వారి సంతకాలు తీసుకొని గ్రామ కరణములే ఆ లెక్కలను ప్రభుత్వానికి అందచేస్తే

బాగుంటుంది అదికాక రైతులు తమ లెక్కలను ఆ గ్రామంలో, లేక ఆ ఫిర్కాలో వున్న రెవెన్యూ ఇనెస్పెక్టరుకు ఇవ్వకుండా 30, 40 మైళ్ళ దూరంలోవుండే తాలూకా హెడ్ క్వార్టర్స్ లో తహసిల్దారుకు ఇవ్వటం అనేది వ్యయప్రయాసలతో కూడిన విషయము ఈ ఆర్డినెన్సును పురస్కరించుకొని రైతుకు సంవత్సరానికి నికరాదాయం 3,600, 4,000 వుండాలని కొందరు సభ్యులు చెప్పారు అది - చెంగల్వరాయనాయుడుగారు చెప్పినట్లు-చాలా అన్యాయమైన విషయము ప్లానింగ్ కమీషన్ వారు కాని, రాష్ట్ర ప్రభుత్వం కాని రైతుకు సంవత్సరానికి నికరాదాయం 3000 వుండాలని నిర్ణయించటం భావ్యముకాదు దేశంలో సోషలిష్టు సమాజాన్ని స్థాపించాలని చెప్పే ప్రముఖులు, ప్లానింగ్ కమిటీ సభ్యులు నెలకు 5,000 జీతం తీసుకొంటూ, రాత్రింబవళ్ళు నిద్రాహారాలు లేక, అనేక ఇక్కట్లకు లోనై కష్టపడే రైతుకు సంవత్సరానికి 3,000 అని నిర్ణయించటం భావ్యమైన విషయంకాదు వారి బిడ్డలకు విదేశాలలో చదువు చెప్పిస్తూ, కార్లలో తిప్పటం చూస్తే వారికి సోషలిష్టు సమాజ స్థాపన ఉద్దేశ్యం లేదని తెలుస్తోంది. ఈ రైతులలో అనేకమంది స్త్రీల పేర పట్టా భూములు వున్నాయి వారు తాలూకా ఆఫీసుకు వెళ్ళి లెక్కలను చెప్పటము సాధ్యంకాదు గ్రామ మునసబులే వారివద్ద వ్రాతమూలకంగా స్టేటుమెంటు తీసుకొని పంపుతే సరిపోతుందని నేను ప్రభుత్వానికి తెల్పుతున్నాను. ఈ ఆర్డినెన్సును ప్రకటించటంవల్ల రైతులలోవున్న పరపతి నశించింది హాస్పిటల్ కు వెళ్ళటానికి గాని, మరి ఏ ఖర్చులకుగాని డబ్బు రైతుకు కావాలంటే land reforms వస్తున్నాయి. నీ భూమిని ఎట్లా హామి వుంచుకొని డబ్బు యివ్వాలి, అని అప్పు యిచ్చేవారు అంటున్నారు దానివల్ల రైతులు భయభ్రాంతులవుతున్నారు కనుక వారికి భయంలేకుండా ఈ ఆర్డినెన్సులో వున్న ఆంతర్యాన్ని రెవిన్యూ మంత్రిగారు స్పష్టంగా వివరించాలని కోరుతు సెలవు తీసికొంటున్నాను.

*శ్రీ బి వి. శివయ్య (మార్తూరు) · అధ్యక్షా, ఈబిల్లును భూసంస్కరణ లకు ముడిపెట్టవద్దని, దానికి దీనికి ఏమీ సంబంధంలేదని ఈ బిల్లు శాసనసభ ముందుకు రాకముందు మంత్రులు కొన్ని ప్రాంతాలలో పర్యటిస్తూ వచ్చారు కాని గతకొన్ని సంవత్సరాలనుంచి ఈ land reforms అనే race ప్రారంభమైనట్లు కన్పిస్తోంది. అన్ని రాజకీయ పక్షాలుకూడా ఈ race లో ఎవరు ముందుకు పరిగెత్తుకుపోవాలి అని, ఎవరు పెద్దగొంతుతో అరవాలని ఈ race ప్రారంభించారు కాని ఇవి త్రికరణశుద్ధిగా నిజముగా చెప్పే మాటలు కావని అనిపిస్తుంది. ఈ బిల్లుకుముందు ఆర్డినెన్సు ప్రకటించారు. ఆ ఆర్డినెన్సు

ప్రకటించినవుడు భూసంస్కరణలకు ఏ మాత్రం సంబంధంలేదు ఎవరు ఖంగారు పడవద్దు, అని ప్రకటించారు కాని ఈ బిల్లుయెక్క statement of objects and reasons లో యిలా చెప్పారు

"The question of undertaking land reforms in Andhra has been under the consideration of the Government for some time past"

భూసంస్కరణలు చేయాలని ప్రభుత్వం ఎంతో కాలంనుండి ఆలోచిస్తున్నది దానికి నాందిగా ఈ ఆర్డినెన్సు ప్రకటించటం జరగినది అని ఈ బిల్లులో మొదట పీరిక వ్రాస్తూ చెప్పారు పీరికలో అలా వ్రాసి ఇప్పుడు భూసంస్కరణలకు ఏమి సంబంధము లేదని చెప్పటము నిజమో లేక ఈ race లో మాటలకోసం చెప్పటమో మాకు అర్థం కావటములేదు హెచ్చుగా, పెద్ద గొంతులో ఈ నినాదమును పలికి అభివృద్ధి కాముకులమవుదామనే తత్వంలో ఉపయోగిస్తే ఏమి అభ్యంతరములేదు ఈనాడు దేశంలో land reforms వద్దనే వారు ఎవ్వరులేరు కాని ఈ land reforms తీసుకువస్తామని చెప్పేముందు దేశఅవసరాలకు ఏవిధంగా మనందోహదకారులమవుతామని ఆలోచించాలి. land reforms తీసుకువస్తామని ఎంతోకాలం నుంచి అంటున్నాము, సెన్సెస్ సేకరించాము కమిటీలపై కమిటీలు వేశాము కమిటీ రిపోర్టులు వచ్చాయి వాటిని ప్రభుత్వము పరిశీలించింది పరిశీలించిన తరువాత కూడా యింకా ఏవో లెక్కలు కావాలని, 6 నెలలలో బిల్లుతెచ్చి మీముందు పెడతామని ప్రభుత్వం చెప్పింది దీనికి భిన్నముగా అధికారంలోవున్న మంత్రులు కొందరు 'ఎవరైనా సంస్కరించవలసినదేకదా! ఎవరిభూమి వారే సంస్కరించుకొంటే మాత్రము తప్పేముంది ? ఎవరిభూమిని వారే సంస్కరించుకోండి' అని చెప్పుతున్నారు ఆ విధం తలవనితలంపుగా వారి హృదయాలలోని మాటలు బైటపడుతున్నవి. ఈ నినాదము దేశానికి మేలు కల్గించటంకంటే హానిచేస్తుందేమోనని అనిపిస్తోంది భూమిని మరమ్మతు చేయించక అధికంగా ఆహారము పండించటానికి ఏవిధముగాను సహకరించుటలేదు అందువల్ల ఆహారోత్పత్తి దెబ్బతింటుందనటానికి సందేహంలేదు. ఈ ఆర్డినెన్సు రాకముందే భూసంస్కరణలు తప్పక వస్తాయని, అది మాకు గర్వకారణమని అనుకొన్నాము ఎవరిభూమినివారే సంస్కరించుకోండి భూసంస్కరణలను తేపోవటం లేదని బాధ్యత లేనివారుగా చెప్పటంవల్ల ప్రజలలో నిరాశ కల్గింది మళ్లీ కొంప మునిగిపోయినట్లుగా ఈ ఆర్డినెన్సు ప్రకటించి 6 నెలలలో భూసంస్కరణలను తెస్తున్నామని ప్రభుత్వం ప్రకటించటం దేశంలో అలజడి కల్గించటానికి మాత్రమేనని కొంతమంది అనుకొంటున్నారు. దానికి కూడా కారణం లేకపోలేదనే విశ్వాసం మాకు కల్గింది Land reforms తీసుకు

రావటానికి ముందు ప్రథమచర్యగా ఈ ఆర్డినెన్సు తీసుకువచ్చామని objects and reasons లో చెప్పారు. కాని ప్రత్యేకంగా ఈ ఆర్డినెన్సు ఎందుకు తీసుకు వచ్చారో మాకు అర్థం కావటంలేదు. మెట్టకాని, మాగాణి కాని 30 ఎకరాల పైగా వున్నవారు ఎంతమందో, 20 ఎకరాలకు పైన వున్నవారు ఎంతమందో, ఒక సెంటుకుపైన భూమి వున్నవారు ఎంతమందో లెక్కలు సేకరించారు. ఆ లెక్కలప్రకారం ఆంధ్ర ఏరియాలో 20 ఎకరాలు భూమివున్నవారు 1,72,000 మంది అని తెలిసింది కాని ఈ ఆర్డినెన్సు ప్రకటించినదినం ముందు ఎంతమంది వున్నారని చూస్తే కొన్నివేలమంది తక్కువ వుంటారనేవిషయం నిర్వివాదాంశము

సెప్టెంబరు 21 తేదీన 20 ఎకరాలకు పైన భూమివున్న భూ ఖామందు లందరు తమకు ఎంతభూమి వున్నదో తహసిల్దారుకు చెప్పుకోవాలనే ఈ ఆర్డినెన్సు పత్రికలలో రాగానే ఈ క్రిందటిరోజు స్టాంపు వెండర్స్‌వద్ద తీసు కొన్న స్టాంపులను చూస్తే ఎన్ని అన్యాక్రాంతాలు జరిగాయో తెలుస్తుంది రు 1-0-0 కు రు 5-0-0 ఇచ్చి స్టాంపులు కొని కుటుంబములోని వారికిగాని, యింకా ఇతరులకు గాని భాగాలుగా పంచి ఇవ్వటం జరిగింది

అట్టివారందరూ భూమి లెక్కలు యివ్వవలసిన బాధ్యతనుంచి కూడా తప్పించుకున్నారు Transfer of Property Act ను బట్టిగాని, Registration Act ను బట్టిగాని, Stamp-Vendor దగ్గర వెనుకటి ఏ తేదీలో Stamp కొనబడి ఉన్నదో, ఆ తేదీన agreement వ్రాసి ఉన్నట్లయితే ఆ తేదీన property transfer అమలులోనికి వచ్చినట్లు పరిగణించబడుతుందని తెలుస్తుంది ఈవిధంగా భూస్వాములు stamps కొరకు పరుగెత్తడం, వారి భూములు 20 ఎకరాల లోపున సర్దుబాటు చేసుకోవడం జరిగిపోయింది రైతులమీద 500 రూ ల జరి మానా వేయడం, యివ్వకపోతే భయపెట్టడం చేయాలని కొంతమంది సభ్యులు చెప్పారు 500 కాదు 5000 రూ లు జరిమానా వేసినాకూడా ప్రయోజనం ఉండదు. ఒక రైతుకూడా జరిమానాకు పాత్రుడు కాడని మనవి చేస్తున్నాను.

భూసంస్కరణలు తేవడానికి, ఏవిధంగా యిది నాందిగా పనికివస్తుంది ? నిజమైన భూసంస్కరణలు తేవడానికి యిది అవసరమా ? అనేది చూస్తే ఏమాత్రంకూడా అవసరం లేదని తెలుస్తోంది తెలంగాణాలో యింతకుముందే భూసంస్కరణలు తెచ్చారు. వారు ఈవిధంగా ఒక ఆర్డినెన్సును ప్రత్యేకంగా తేలేదు. వారు 1950 సం. లో చేసిన చట్టంలోని, రాష్ట్రప్రభుత్వానికి యీ

**Land census** సేకరించడానికి అధికారం ఉండేలాగున ఒక సెక్షను రూపొందించారు తెలంగాణాలో యీచట్టం రూపొందించినప్పుడు కుటుంబంలో ఎంత మంది ఉంటారు? శాస్త్రీయంగా ఒక్కొక్క భూమిమీద మాగాణి, మెట్ట, గరువుభూమి, చౌడుభూములు వీటిమీద ఎంత ఆదాయం వస్తుంది అనే లెక్కలు మదింపుచేసి యీ డబ్బంతా ఎకరాలలోకి మార్చి అయిదుగురుగల కుటుంబ కమతం అంటే 6 ఎకరాలు మాగాణి భూమి వుండవచ్చునని నిర్ణయించారు ప్రస్తుతం ఉన్నట్టి భూఖామందులంతా కూడా దానికి 4½ రెట్లు దాకా ఉంచుకోవచ్చునన్నారు కొనబోయేవారు 3½ రెట్లు తీసుకోవచ్చునన్నారు అదే విధంగా మెట్టప్రాంతాలలోకూడా ఫలసాయాన్ని మార్చారు మెట్టప్రాంతాలు అయితే ఇన్ని ఎకరాలు **Family holding** అని నిర్ణయించారు, నల్లరేగడి భూములు 24 ఎకరాలో, ఎంతో నిర్ణయించారు దానికి 4½ రెట్లు వరకూ ఉంచుకోవచ్చునని చెప్పారు నిజంగా భూసంస్కరణలను కోరుతున్నామా, లేక యిది పరుగుపందెమా? లేకపోతే హృదయపూర్వకంగా వస్తున్నదా? భూసంస్కరణలు కోరేవారందరూ అనుకున్నది ఏమంటే. హైదరాబాదు చట్టానికి ఒక **Ordinance** యిచ్చి ఆంధ్రప్రదేశ్‌కు ఎందుకు **extend** చేయకూడదు అనిపిస్తున్నది శాసనసభ సమావేశం రాబోతున్నది వచ్చినప్పుడు తెలంగాణాలో యింతకాలంనుంచి అనుభవంలోవున్న చిక్కులను, లేక జారీ చేసిన **Rules** లో ఏమైనా చిక్కులున్నట్లయితే, లేక చట్టంలో పొరపాట్లు వున్నట్లయితే ఆసవరణలను సరిచేసుకుంటూ ఒక ఆర్డినెన్సు జారీ చేసినట్లయితే నిజమైన భూసంస్కరణలు వెంటనే వచ్చేవి. కాంగ్రెసు సిద్ధాంతం ప్రకారం చాలా రోజులనుంచీ కాంగ్రెసువారు చెబుతున్నదంతా కూడా ఆచరణయోగ్యమయ్యేదని మాకందరికీ అనిపించేది. అంతేకాదు ఆ **Ordinance** యీ బిల్లువల్ల నిష్ప్రయోజన మవుతోంది

భూసంస్కరణలవల్ల ప్రయోజనం రాకుండా చేయడానికి యిది దోహదం చేస్తుందనేకాని, భూసంస్కరణలు రావడానికి ఏమాత్రంకూడా దోహదకారి కాదు పైగా యీబిల్లు భూసంస్కరణల **Purpose** నే **defeat** చేస్తున్నట్లు అయిపోయిందని మేము భావిస్తున్నాము.

శ్రీ కె వెంకటరావు: ఎవరు ఆ 'మేము'? పార్టీ సంబంధమా? లేక **(Royal we)** గా చెబుతున్నారా?

శ్రీ కె. యల్ నరసింహారావు (ఎల్లందు-జనరల్). Mr. Speaker, Sir, భూమి వసతిని (land holdings) గురించి ఉన్న ordinance ను యిప్పుడు Bill స్వరూపంలో తీసుకువచ్చారు

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య On a Point of order, Sir ఇదివరకు ఒకసారి ఒక మెంబరును ఇంకొక మెంబరు బెదిరించకూడదు, warning యివ్వ కూడదు అన్నారు ఇప్పుడు రెవిన్యూమంత్రి గారు 'జాగ్రత' అని ఒక సభ్యుడిని అన్నారు అది సరిపోయిందా అని అడుగుతున్నాను

మిస్టర్ స్పీకర్ పార్టీమాట చెప్పారు, పార్టీమాట యిక్కడ చెప్పకూడ దన్నాము, సరిపోయింది ఇంక ఎందుకు అదంతా ?

శ్రీ కె. యల్. నరసింహారావు Land census కు సంబంధించి information ను gather చేయడానికి గతంలో ప్రభుత్వంవారు, ఒక ఆర్డినెన్సు జారీ చేసినారు దానిని యిప్పుడు బిల్లు స్వరూపంలో మన ముందుకు తెచ్చారు అయితే, యిది భూ సంస్కరణలకు సంబంధించిన మొదటి చర్యగా Statement of objects and reasons లో చెప్పారు దీంట్లో స్పష్టంగా రెండు యిబ్బందులు న్నట్లు తెలుస్తోంది అంతేకాకుండా, ప్రభుత్వం ఏదైనా చట్టంతీసుకొనివస్తే పేచీలు, చిక్కులతో సృష్టించకుండా వుండాలి, కాని వారికి వున్న legal knowledge నంతా ఈ బిల్లులలోనూ, చట్టాలలోనూ యిరికించి పేచీలు పెంచేట ట్లుగా గాని, ఒక సెక్షనును, రెండవ సెక్షను contradict చేస్తూ గాని, లేకపోతే ఒక చేతితో యిచ్చి, రెండవ చేతితో పుచ్చుకొనేవిధంగా గాని తీసుకువస్తే ప్రజలకు ఏమాత్రమూ ఉపయోగపడదనేదానిని మనం ముందుగా అర్థం చేసు కోవలసిన అవసరం ఉన్నది. ఇదివరకు ఆంధ్రప్రాంతంలో land reforms లేవు. వాటిని తీసుకురావడానికి ప్రథమ సోపానంగా ఒక ఆర్డినెన్సును జారీచేశాము. Holdings విషయంలో మాకు బొత్తిగా information లేదు, information సంపాదించేందుకే మేము యిది తీసుకువచ్చాము" అని మంత్రిగారు చెప్పారు. వారు ఒకటిమాత్రం చేయవలసియున్నది ఈవేళ ఆంధ్రప్రదేశ్ లో ఒకభాగమైన తెలంగాణాలో land reforms యిదివరకే ఒక మేరకు అమలుజరుపబడినాయి. ఇక్కడ కొన్ని అనుభవాలు ఉన్నాయి వీటిని తీసుకొని, అక్కడ land reforms ప్రవేశపెట్టడానికి ప్రయత్నంచేసినట్లయితే ఎంతో చక్కగా ఉండేది వారు [illegible] భూసంస్కరణలు తీసుకువచ్చి, భూసమస్యను పరిష్కారం చేయదలచు [illegible] ఇక్కడి అనుభవాలను తీసికొంటే, వారికి ఎంతో తోడ్పడేవి.

ఈవేళ మన ముందు పెట్టిన బిల్లును బట్టి వారు గత అనుభవాలను ఆధారం చేసుకొని, నూతనంగా ఒక కార్యక్రమాన్ని వేసికొని ముందుకు పోవడానికి సిద్ధంగా ఉన్నట్లు కనబడుటలేదు తెలంగాణా ప్రాంతంలో holdings కు సంబంధించి అనేక పేచీలు జరిగాయి నేను ఖమ్మం జిల్లాకు చెందినవాడిని అక్కడ హైదరాబాదు టెనెన్సీ అక్టు చాలా తీవ్రంగా అమలుచేయబడిందని ప్రపంచమంతా చెప్పుకున్నారు అంతేకాకుండా కౌలుదారులనందరినీ భూ కామందులుగా మార్చే Section 38 (E) ని మా జిల్లాలో అమలు జేశారు ఈ సందర్భంలోనే నేనొక విషయాన్ని మీ దృష్టికి తెస్తున్నాను

ఈ భూములను విభజించుకోవడం అనే దానిని నిషేధించనందువల్ల తెలంగాణా ప్రాంతంలో చాలా పేచీలు వచ్చాయి నాకంటె ముందు ఉపన్యసించిన సభ్యులు చెప్పినట్లుగా మైనరులకు, పుట్టబోయే పిల్లలకుకూడా భూమి పంచి పెట్టడం జరిగింది M L A చిత్రంలో షావుకారు పంచిపెట్టినతరునాత బాధపడ్డాడు— అట్లా ఒకటి, రెండుచోట్ల జరిగిందికాబట్టి దానిని అనుభవంలోకి తీసుకొని చిత్రనిర్మాత అట్లా చేశాడని స్పష్టంగా ఋజువుచేయడానికి సిద్ధంగా ఉన్నాను మా తాలూకాలో మా గ్రామం ప్రక్కనవున్న గ్రామంలో ఒక భూస్వామి పరచా కిషన్‌రావుగారు అట్లా పంచిపెట్టారు

మిస్టర్ స్పీకర్ పేర్లు చెప్పవద్దు.

శ్రీ కె యల్ నరశింహారావు ఇట్లాంటివి అనేకం ఉన్నాయి భార్యాభర్తలు యిద్దరూ ఒకేచోట కలసి ఉన్నారు కాపురం చేస్తూ బాగానే ఉన్నారు కాని వారిద్దరు వేరుపడ్డట్లుగా చూపించి ఆస్తులు పంచుకొన్నారు

మిస్టర్ స్పీకర్ పేరులు చెప్పవద్దు, కాని ఉదాహరణ చెబితే నాకు ఆక్షేపణ లేదు.

శ్రీ కె. యల్. నరసింహారావు భార్యాభర్తలు పంచుకున్నారు, ఆడపిల్లలకు పంచారు, మైనరులకు పంచారు. హిందూ లా ననుసరించి ఆడపిల్లలకు యింతవరకూ సంపూర్ణమైన సమానహక్కులు దొరకలేదు అయినప్పటికీ ఆడపిల్లలపేర భాగాలు వ్రాశారు. వీటన్నింటినీ స్వయంగానే అనుభవిస్తున్నారు 38(e) అమలు జరిపినప్పటినుంచీ రెండు family holdings మాత్రమే వారికి మిగులుతాయి పైగా ఉన్నభూమికంతటికీ అక్కడ రక్షిత కౌలుదారులుగా

వుండేవారు భూకామందులుగా మారిపోయారు తమభూమిని అక్రమంగా కాపాడుకోడం కొరకు ఒక్కొక్క కుటుంబంలోనివారు, కుటుంబంలో వుండే, 7, 8 మంది పంచుకోడంద్వారా 8×2=16 family holdings గాని, 7×2= 14 family holdings గాని మిగుల్చుకోడానికి ప్రయత్నించడం, మిగుల్చుకోవడం సంభవించింది ఉదాహరణకు, ఆంధ్రప్రదేశ్ ఏర్పడక ముందు, కళా వెంకటరావుగారు రెవిన్యూమంత్రికాకముందు, ఖమ్మంలో Land Commission President గా మందుముల నర్సింగరావుగారు, రెవిన్యూమంత్రిగా శ్రీ కొండా వెంకటరంగారెడ్డిగారు వచ్చి "ఇక్కడ 38(e) ని apply చేస్తున్నాము 58(c&b) ని కూడా apply చేస్తున్నాము అంటే మేము ceiling విధించి ఎక్కువవుండే భూమిని తీసుకొని పేదప్రజలకూ, చిన్నరైతాంగానికీ పంచదలచుకున్నాము, మేము సేకరించిన లెక్కలప్రకారం 92 వేల ఎకరాలభూమి యీ జిల్లాలో లభిస్తుంది, అది మేము పంచిపెడతాం" అని పదివేలమంది ప్రజలువచ్చిన బహిరంగసభలో చెప్పడం జరిగింది. కాని కళా వెంకట్రావుగారు రావడంతోటే అది 5 వేల ఎకరాలకు పడిపోయింది కారణం ఆ జిల్లాలో విభజనను నిషేధించక పోవడమేనని గుర్తించవలసిన అవసర మున్నది. కాని ఒక్క సంవత్సరమే గడువు ఉన్నది ఈ సంవత్సర కాలంలో రంగారెడ్డిగారు, నర్సింగరావుగారు ఖమ్మంలోనే ఉపన్యసించారు మా లెక్కల ప్రకారం ఖమ్మంలో 92 వేల ఎకరాలు లభిస్తోంది అవకాశం వుంటే యింకా ఎక్కువే లభించవచ్చునని వారు ప్రజలముందు స్పష్టంగా చెప్పివచ్చారు. కాని ఈవేళ 4, 5 వేలఎకరాల భూమికూడా దొరకదు దానినిగురించి అంత పెద్దగా ఆలోచించడం అనవసరం, పొరపాటు అని కళా వెంకటరావుగారుచెప్పడం జరిగింది.

మిస్టర్ స్పీకర్ :- అట్లా జరుగుతుందని వారుకూడా చెప్పలేదు

శ్రీ కె. ఎల్ నరశింహారావు చెప్పారండి చెప్పకపోతే, వారేచెప్పలేదంటారుగా

మిస్టర్ స్పీకర్. - ఏమండీ? 4,5 వేలని చెప్పారా ?

శ్రీ కె. ఎల్. నరశింహరావు - వారుకనుక అనకపోతే మాట్లాడకుండా, జవాబు చెప్పనిదే వారు ఊరుకుంటారా ?

శ్రీ కె వెంకటరావు : ఈ రకమైనటువంటి allegations కు ఎప్పుడూ సమాధానం చెప్పదలచుకోలేదు. వారిదగ్గరఉన్నంత ఆవేశం మా దగ్గరకూడా ఉందని చెప్తున్నాను

మిస్టర్ స్పీకర్ - అట్లా జరిగిందో లేదో, ఇట్లా ఉన్నదని చెప్పండి ఫరవాలేదు

శ్రీ కె ఎల్ నరశింహారావు ఈ విధంగా holdings మనకు తెలుపవలయును అని కోరేముందు విభజనను నిషేధించక పోవడమనేది Land-Reforms కు పెద్ద ఆటంకంగా ఉంటుందనే విషయం మనం గుర్తించవలసిన అవసరం ఎంతైనా ఉంది ఆంధ్రనుంచి వచ్చిన మిత్రులలో కొంతమంది, "ఎపుడైతే ordinance ను జారీచేశారో ఆ తెల్లవారే ఒక రూపాయి stamp కు 5 రూపాయిలు యిచ్చికొన్నారు అని చెప్పినవారున్నారు 20 ఎకరాలు, అంతకంటె ఎక్కువగా ఉన్నవాళ్ళు ఇంతకుముందు లెక్కల ప్రకారం, 50, 60 వేలమంది దొరికితే, వాళ్ళంతా ఈ విధంగా స్టాంపులు తీసుకున్న వాళ్ళుగా ఉంటే, ఈ వేళ 10 వేల మంది కూడా దొరకడం కష్టం అని చెప్పినవారు కూడా ఉన్నారు ఈ విధంగా భూములను విభజించుకొనే అవకాశం ఇందులో లేకుండా చేయాలి Minors అయినవారు Majors-అయినపుడు వాళ్ళకు Hindu Law ననుసరించి విభజించుకొనే హక్కుంటే అపుడు ఏమి చేస్తామనేది ఆలోచించవచ్చు మంత్రిగారు "మేము20 ఎకరాలు ఉన్నవాళ్ళను, అంతకుపైన ఉన్నవాళ్ళను information ఇవ్వమని అడిగాము అంతేకాని, 20 ఎకరాలే సీలింగుగా పెడుతున్నామని కాదు, మాకు కొంత information కావాలి ఆ information ను సంపాదించడంకోసమే మేము ఈ ordinance ను జారీచేశా"మని చెప్పారు అట్లాంటపుడు కుటుంబానికి నిర్వచనం యిచ్చి ఆ కుటుంబంలో మొత్తం ఎంతభూమి ఉన్నదో తెలుసుకోడానికి ప్రయత్నించినపుడే మనం సరైన land reforms ను తీసుకురాగలుగుతామని నేను అనుకొంటున్నాను అయితే ఇపుడు హైదరాబాదులో ఉన్నటువంటి Tenancy Act లో కూడా కుటుంబ నిర్వచనం లేకపోబట్టే అనేక చిక్కులు, పేచీలు వచ్చినై. ఇంతకుముందు తెలంగాణా మిత్రుడు ఒకరు మాట్లాడుతూ కుటుంబం అంటే నిర్వచనం దాంట్లో ఉందని చెప్పారు ఎపుడైతే సీలింగ్ విధింపబడిందో ఆ సందర్భంలో కుటుంబం అంటే ఏమిటో చెప్పడానికి ప్రయత్నం చేశారు అంతేకాని ఇతరత్రా ఎక్కడా అట్లా నిర్వచించలేదు Ceiling విధించే సందర్భంలో "4½ family holdings ఒక కుటుంబానికి వదలుతాము, 5 మంది ఉన్న కుటుంబాన్ని మేము లెక్కలోకి తీసుకుంటాము, ఆపైన ఉన్న ప్రతి సభ్యుడు భాగస్థుడుగా ఎంచి ఒక family holding ను వదలుతాము" అని ఆ సందర్భంలో చెప్పారు కుటుంబం అంటె సరైన definition మా తెలంగాణా Act లో కూడా లేదని చెప్పదలచుకున్నాను. అయితే ఈ

సందర్భంలో 20 ఎకరాలు ఉన్నవాళ్ళే information యివ్వాలన్నారు 20 ఎకరాలు ఉన్నవాళ్ళంటే ఎవరు? ఇది చాలా ముఖ్యమైన విషయం 20 ఎకరాలు కర్నూలు ప్రాంతంలో ఉన్నాయంటే లేక మెట్ట ప్రాంతాల్లో 20 ఎకరాలున్న కామందున్నాడు అంటే, అట్లాగే కృష్ణా, గుంటూరు, మొదలైన జిల్లాలలో 20 ఎకరాలున్న కామందున్నాడంటే ఇవన్ని ఒకే లెక్కగా భావించే అవకాశం మనకు ఉన్నదా అంటే లేదు 20 ఎకరాలకు ఎకరం ఒకటికి 5, 6 వేల రూపాయల విలువకలిగిన మాగాణీభూమి భూస్వాముల **data** మనకు దొరకదు అట్లాంటప్పుడు మళ్ళీ ఒకసారి 5 ఎకరాలలోపు మాగాణీ భూమి ఉన్నవాళ్ళంతా మాకు తెలపండి అని ఆనాటు ప్రకటించడం కాని 10 ఎకరాలలోపు ఉన్నవాళ్ళంతా మాకు తెలపండి అని ప్రకటించడం కాని చేయవలసిన అవసరం ఏర్పడుతుంది ముఖ్యంగా ఈ **land census** ను తేల్చుకొనే విషయంలో 20 ఎకరాలు అంటే ఆ ప్రాంతంలో 18 ఎకరాల మాగాణీభూమి ఉన్నవాళ్ళు మనకు తెలుపవలపిన అవసరం లేదు అంటే 18 ఎకరాల మాగాణీ 2 ఎకరాల మెట్ట కలసి 20 ఎకరాలు ఉంటే కూడా తెలుపుతారు కదా అనేది రావచ్చు. అచ్చంగా 18 ఎకరాల మాగాణీ ఉంటే తెలుపవలసిన అవవరమేలేదు కదా! కాని 100 ఎకరాల మెట్ట భూమి ఉన్నవాళ్ళకన్న మంచి విలువైన మాగాణి భూమి 20 ఎకరాలకు తక్కువ ఉన్న రైతు మంచి ఆదాయాన్ని సంపాదించే రైతుగా పరిగణింపబడుతున్నాడు కనుక ఈ రెండింటినీ దృష్టిలో పెట్టుకొని మెట్ట ఇంత అని, మాగాణీ యింత అని వివరంగా, విడివిడిగా **data** సేకరించడం కొరకు ప్రయత్నం చేసిఉంటే బాగుంటుందేమో, ఇపుడు ఈ సమాచారాన్ని సేకరించడానికి అనుసరింపబడే ఈ విధానం గురించి నాకు అభిప్రాయభేదం ఉంది. ఇదివరలో హైదరాబాద్ రాష్ట్రంలో సమాచార సేకరణకు ఒక **Land Commission** ను ఏర్పాటుచేయడం జరిగింది. ఇక్కడి గ్రామాలలో పహాణీలు అనేవి ఉన్నాయి ఆ ప్రాంతాలలో పహాణీలున్నాయో లేదో నాకు ఎరుకలేదు గ్రామాలలోని భూములకు సంబంధించిన లెక్కలు ఆ యా గ్రామాధికారుల దగ్గర ఉంటాయి **Tahsils** లో జమాబందీ జరుగుతోంది. **District** జమాబందీ ప్రతిసంవత్సరం చేస్తున్నారు. జమాబందీలు చేస్తున్నపుడు ప్రభుత్వం దగ్గర భూములకు సంబంధించిన **information** పూర్తిగా ఉంది అనే విషయం స్పష్టమైనదే. అయితే దీంట్లో, భూమికి సంబంధించిన **information** రైతునే యివ్వమంటున్నారు. అతడు లెక్కలు తప్పుగా యిస్తే జరిమానా వేస్తామన్నారు. అంటే వారు లెక్కలు తప్పుగా యిస్తే ఆ లెక్కలను పరిశీలించడం కొరకైనా మనం లెక్కలు తయారు చేయవలసిన అవసరం ఉన్నది. అందుకని ముందుగా

ప్రభుత్వం ఈ 20 ఎకరాలు, 30 ఎకరాలు అనకుండా తెలంగాణా ప్రాంతంలో ఎట్లాగైతే holding sheets ను తయారు చేశారో- ఒక ఎకరం కానివ్వండి, 2 ఎకరాలు కానివ్వండి 10 ఎకరాలు కానివ్వండి, అదేవిధంగా holding registers ను ఆంధ్రప్రాంతంలో కూడ prepare చేసి ఉన్నట్లయితే వాళ్లలో అనుమానం రేకెత్తడం కాని, ఈ వేళనే తొందరపడి ఎక్కువ డబ్బుపెట్టి stamp లు కొని ఎక్కువ registration fees యిచ్చి వెంటనే registration చేసుకోవలసిన అవసరం, లేక అంతా వేరుపడుతున్నట్లుగా సృష్టించి పసిపిల్లలపేర భూమి వ్రాసి, విభజన చేసుకోవలసిన అవసరం కలుగదు ఈ data ను సేకరించే సందర్భంలో మనం ordinance జారీ చేసినప్పటినుంచీ, విభజనల స్వరూపంలో జరిగిన అన్యాక్రాంతాలను నిషేధిస్తూ, అవి చెల్లకుండా చేస్తూ మనం data సేకరించుకోవలసిన అవసరం ఉంది రైతులకందరికీ చదువువచ్చు అని చెప్పడానికి సాధ్యం కాదు అతడికి ఏ Survey Number లోనో, acreage లోనో difference ఉంటుంది అతనికి చదువురాదు కనుక అలా జరుగవచ్చు ఆ difference వచ్చినందువల్ల అతనికి 5వందల రూపాయల penalty, correct information ఇచ్చేదాకా వరుసగా రోజుకు 100 రూపాయల జరిమానా విధించవలసి ఉన్నది అనేది ఒక అనుమానాస్పదమైన విషయం ఈ సందర్భంలో దీంట్లో ఒక విషయం చేర్చవలసిన అవసరం ఉందనుకుంటాను ఏదైనా రైతుకు లెక్కల విషయంలో అనుమానంవస్తే, అక్కడ స్థానికంగా ఉన్న Revenue Officer కు ఒక petition పెట్టుకోవడం, ఆ petition పైని ఏ written order అయితే వేయబడుతుందో దానిని అనుసరించే యీ లెక్కలను ఇచ్చే వీలు కలిగించాలి అలాంటపుడు అతనిమీదికి case వచ్చే అవకాశాలు లేకుండా చేయవలసిన అవసరం కూడా ఉంటుందని నేను భావిస్తున్నాను కనుక దీనిని ఈ బిల్లులో చేర్చవలసిన అవసరం ఉందని మనవి చేస్తున్నాను దీనిలోనుంచి తప్పించుకొని పోయే దానికేమైనా మార్గాలుంటే వాటినన్నిటినీ అరికట్టడం ద్వారా మనం ఈ సమాచారాన్ని సేకరించడానికి ప్రయత్నంచేస్తే బాగుంటుంది కాని, తప్పించుకొనే మార్గాలను అలానే ఉంచి సమాచారాన్ని సేకరించడానికి పూనుకుంటే, "మేము Land Reforms తీసుకు వస్తున్నాము మీరు జాగ్రతపడి ఈవేళ 20 ఎకరాలు అంతకులోపుననే వుంచుకుంటేనే మీ భూమి మీకు దక్కుతుంది లేకుంటే మీ భూమినంతా గుంజుకోబోతున్నాము" అని భూస్వాములకు warning యిచ్చి మేలుకొల్పు పాడినట్లుగా ఉంటుంది. ఆవిధంగా యివి అన్యాక్రాంతం కాకుండా చట్టాన్ని దెబ్బతీసే రీతిగా విభజనలు, భాగాలు జరగకుండా దానిని ముందు హద్దులోకి తీసుకు రావడం ద్వారా ఈ సమాచారాన్ని సేకరించడానికి పూనుకుంటే బాగుం

టుందని చెబుతున్నాను Amendments వచ్చినపుడు స్పష్టంగా ఇంకా వివరాలు చెప్పడానికి ప్రయత్నం చేస్తానని చెబుతూ ముగిస్తున్నాను

*శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా! మొట్టమొదట ఈ ordinance ను తీసుకురావడం నాకు ఆశ్చర్యం కల్గించింది ఆంధ్రప్రదేశ్ రాబోయే ముందు కాంగ్రెస్ పార్టీకి leader-ship ఎన్నికలు వచ్చినప్పుడు ఆంధ్రదేశం అంతా తీవ్ర ప్రచారం జరిగింది.

మిస్టర్ స్పీకర్ ఇప్పుడవన్ని మొదలు పెట్టాలా? మీరు leader-ship election గురించి మాట్లాడుతున్నారు దానికి సమాధానం వారు చెప్పవలసి వస్తుంది

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య నా election గురించి మాట్లాడితే నాకేమీ అభ్యంతరం లేదు దానికి నేను సమాధానం చెప్పడానికి సంసిద్ధంగా ఉన్నాను

మిస్టర్ స్పీకర్ . ఆయన ఏమిచెప్తారో అది well known fact అయితే, admitted fact అయితే దానికి సంబంధించిన విషయాలు ఇక్కడ మాట్లాడ వచ్చును అసలు admitted fact అయివుండాలి. అది well known fact, admitted fact అవునో కాదో చూద్దాము

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య · ఔనండి

మిస్టర్ స్పీకర్ అది well known fact అయితే allow చేయడానికి నాకేమీ అభ్యంతరంలేదు కాని, well admitted fact, admitted fact గురించి చెప్పని సందర్భంలో నేను అభ్యంతర పెట్టవలసి ఉంటుంది.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : "గోపాలరెడ్డిగారు భూసంస్కరణలకు వ్యతిరేకం, మేమువచ్చి భూసంస్కరణలను వెంటనే జరపబోతున్నాం, అందు వల్ల ఈ ప్రభుత్వంలో మార్పు రావాలి" అని ఊరూరా ప్రచారం చేసినది, పత్రికలలో ప్రచారం చేసినది, వారికి జ్ఞాపకం లేకపోలేదు. ఇంతలోనే ఆంధ్ర ప్రదేశ్ వచ్చింది. ఆంధ్రప్రాంతంలోని ప్రజలంతా కూడా తెలంగాణాలో ఉన్నటువంటి, కొంతవరకైనా అభివృద్ధికరమైన నటువంటి భూసంస్కరణల

చట్టం ఆంధ్రదేశానికి కూడా వర్తిస్తుందని ఆశించారు ఈనాడు అధ్యక్షుడుగా ఉన్నటువంటి——

మిస్టర్ స్పీకర్ అప్పటినుంచీ భూసంస్కరణలు తెస్తామన్నారు ఇక కానివ్వండి ఏమీ జరగడంలేదని చెప్పండి అంతేకాని, కాంగ్రెస్ అని, ఆ ఉపన్యాసమనీ ఎందుకు చెప్పడం ?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ఈ బిల్లును తీసుకురావడానికి కారణం చెప్తున్నాను

మిస్టర్ స్పీకర్ వారు అప్పుడుచెప్పింది కారణం కాదు

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య వారు అపుడు ఆ విధంగా ఎందుకు చెప్పారో, అందుకుగల కారణాన్ని చెప్తున్నాను అసలు ఇపుడు ఈ బిల్లు ఎందుకువచ్చిందో కారణం తెలుసుకోవాలి కదా !

మిస్టర్ స్పీకర్ అయితే ఇంకేమి ? చెప్పండి

శ్రీమతి వై సీతాకుమారి (భాన్సువడ) అధ్యక్షా, ఆ విధంగా మాకేమీ చెప్పలేదండి కనుక వారిని ఏమడుగుతారో అడగండి ఆ విధంగా ఒక రిస్తారని, మా కెవరూ చెప్పలేదుకనుక ఆమాట వారు విత్‌డ్రా చేసుకుంటే బాగుంటుంది

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య పత్రికలు చూచిన వారందరికీ .

ముఖ్యమంత్రి (శ్రీ యన్ సంజీవరెడ్డి) . శ్రీ గోపాలకృష్ణయ్యగారు యం యల్ ఎ కాకపూర్వం ఇదంతా జరిగిందండి

మిస్టర్ స్పీకర్ మీరు ఎలక్షన్ మానిఫెస్టోమీద పదయినా చెప్పండి.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : దేశపు రాజకీయ పరిణామాల్లో ప్రధానమయిన ఘట్టం వచ్చింది. వారి ఎలక్షనుకు, మాకు సంబంధం లేదు

ఒక గౌరవ సభ్యుడు  అది ఒక కాంగ్రెసు పార్టీకే సంబంధించింది అది వారికి సంబంధించింది ఎందుకవుతుందండి ?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య  నేను మనవిచేసేదేమంటే అధికారంలో ఉన్న వారందరూ ప్రచారం చేసేటప్పుడు "మేము యీ రాజకీయ విధానంతో రాబోతున్నా" మన్నారు  పార్లమెంటు ఎలక్షనులప్పుడుకూడ భూసంస్కరణలు తీసుకువస్తామని చెప్పారు  ప్రజానీకమంతా అత్యాశతో ఎదురు చూసినది తరువాత సంస్కరణలు ఏమయినాయని అడిగితే "అంతా తయారయింది, కాగితం ప్రిపేరు చేశామని, తరువాత కాంగ్రెపార్టీ ఇష్టం, కేంద్రం ఇష్టం, శాసనసభ ఇష్టం" అని అన్నారు  వారు ఎప్పుడు బిల్లును తీసుకువస్తారా అంగీకరిద్దామని మేము ఎదురుచూచినాము  కాని ఆ బిల్లురాకుండా యీ బిల్లు మావుందుకు వచ్చింది  కేంద్రం అడ్డంవచ్చిందో, లేక పార్టీ అడ్డం వచ్చిందో తెలియదు  కాని శాసనసభమాత్రం అడ్డం రాలేదని గట్టిగా చెప్పగలను. ఈ డిశంబరులోగా భూసంస్కరణలు మా ముందుకు తీసుకువస్తామని చెప్పారు

మిస్టర్ స్పీకర్  వారి అభిప్రాయం వారు చెప్పారు మీరు చివరిదాకా దానిమీద మాట్లాడడం తప్పు  అందువల్ల మీకు తోచింది చెప్పండి. ఏదో ఎప్పుడో చెప్పారు— డిశంబరులో అన్నారు అంటే No body can prove it. I cannot allow. You better go on in the usual way

శ్రీ కె. యల్ నరసింహారావు  స్పీకర్ సర్, డిశంబరులోగా వస్తుందని మన డిబేట్ పుస్తకాలద్వారా తెలుస్తుందండి.

మిస్టర్ స్పీకర్: ఏమయినాసరే నేను ఎలవ్ చేయను. నా ఎదుట కాగితం లేనిది నేను ఎలవ్ చేయను  Let the hon Member better go to the other point.

శ్రీ కె. వెంకటరావు  అది కాదండి. ఇది ఒకటే విషయం అయితే బాగుంటుంది

మిస్టర్ స్పీకర్ · 'గోపాల్ రెడ్డి గారి అభిప్రాయాలు, సంజీవరెడ్డి గారి అభిప్రాయాలు' అనేవేమీ అక్కర్లేదు  I condemn that method. Please do not repeat hereafter not only now but in any other debate  ఏదో [illegible]గా మీరు చెప్పడం వారు కాదనడం ఎందుకు ?

శ్రీ బి శ్రీరామమూర్తి శాసనసభ వెలుపల మంత్రులు చేసిన ప్రసంగాన్ని శాసనసభలో ప్రస్తావించేందుకు అవకాశంలేదాండి ?

మిస్టర్ స్పీకర్ ఉన్నది పత్రికలు తీసుకునివచ్చి చూపించాలి గాని, ఊరికే చెప్పారు అంటే వారు కాదంటారు. కనుక నేను అలవ్ చేయను

శ్రీ బి. శ్రీరామమూర్తి కాదండి నా పాయింటు ఇంకా స్పష్టమవలేదండి. అటువంటి పాయింటు రిఫర్ చేసినపుడు అటువంటివి జరగలేదంటే ప్రూవ్ చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది దానిని డినై చేయనంతకాలం అది బేసిస్‌గా తీసుకుని ముందుకు వెళ్ళడానికి అవకాశం ఉంటుంది. శాసన సభ్యులు అటువంటి కటింగ్స్ తీసుకురావడం మంచిదే కాని ఎవైలబుల్‌గా లేనపుడు రిఫర్ చేయడం దోషంకాదని నేను అనుకుంటున్నాను

మిస్టర్ స్పీకర్ దోషమేనని నేను గట్టిగా చెబుతున్నాను "గోపాలరెడ్డిగారి అభిప్రాయం, సంజీవరెడ్డిగారి అభిప్రాయం" అని అదంతా చెప్పకండి ఏదో సంజీవరెడ్డిగారు కొన్ని ఉపన్యాసాల్లో లాండు రిఫారమ్స్ తెస్తానని చెప్పారని చెప్పాలేగాని ఏదో డిశంబరులో తెస్తామన్నారు అని మన దగ్గర లేని డిటైల్సు చెప్పడంతప్పని గట్టిగా చెబుతున్నాను

శ్రీ కె. వెంకటరావు మినిస్టరుగా వచ్చి చెప్పింది విమర్శనచేయడం అన్యాయం మేము కూడ అన్నదానిని కాదనడానికి వీలులేదు ఒకవేళ అన్నా స్పీకరుగారు ఊరుకుంటారా ? సంజీవరెడ్డిగారు లీడరుగా పార్టీలో ఒకరిమీద ఒకరు చెప్పారని, యీ శాసన సభలో ఏ పార్టీకి చెందక, ఇండిపెండెంటుఅయి, ఎపుడూ పార్టీ జురిస్‌డిక్షనులో లేని గోపాలకృష్ణయ్యగారు మొదలు పెడితే దాన్ని తమరు ఎలవ్ చేయడం న్యాయమయిన విషయంకాదు

మిస్టర్ స్పీకర్ : వారు ఇండిపెండెంటుగా మొదలుపెట్టినా, కమ్యూనిస్టుగా మొదలుపెట్టినా, కాంగ్రెసుగా మొదలుపెట్టినా ఒకటే. అదంతా నాకు సంబంధంలేదు ఏ మెంబరయినా వారిలా చెప్పారు- వీరిలా చెప్పారు- అని కాగితాలలోలేనివి చెప్పడం భావ్యంగాదు వారు పార్టీ జనరల్‌గా చెప్పాలి గాని వ్యక్తుల గురించి చెప్పకూడదు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య తమ ఆజ్ఞను పూర్తిగా పాలిస్తున్నాను ఎలక్షను మానిఫెస్టోను వెంటనే అమలు జరుపుతామన్నారు కాని అది రాలేదు, రాకపోగా యీ బిల్లు వచ్చింది ఈ బిల్లు కాలం గడపడానికేగాని వెంటనే సంస్కరణలు వచ్చే ఆశ రాకేమీ కనిపించడం లేదు కేంద్రప్రభుత్వ ఆదేశానుసారం రాష్ట్రప్రభుత్వం భూములనుగురించి స్టాటిస్టిక్స్ సేకరించింది ఆ లాండు హోల్డింగ్సు లెక్కలప్రకారం ఆంధ్రదేశంలో 20 ఎకరాలలోగా భూమి గల రైతాంగం వద్ద 1,35,00,275 ఎకరాలుంటుందని, 20 ఎకరాలకు పైగా ఉన్నవారివద్ద 79,92,954 ఎకరాలున్నదనీ తేలింది కాని ఇప్పుడు వారు "మేము అంకెలు కావలసి యీ బిల్లు తీసుకువచ్చా"మని చెబుతున్నారు ఇదివరకు తీసుకొచ్చిన లెక్కలున్నాయి అవి కొంతవరకు మార్పు చేయడానికి అవకాశం ఉంది కాని 20 ఎకరాలకు ప్రాతిపదికగా కావలసిన అంకెల్లో ఏమీ లోటు ఉండదని నా అభిప్రాయం ఆంధ్రస్టేటులో 1302 బి ప్రశ్నమీద జవాబు చెప్పిన అంకెలనే నేను ఉదహరిస్తున్నాను ఈ అంకెలు ఇలా ఉండగా మళ్లీ స్టాటిస్టిక్స్ సేకరించడంవల్ల చాల డిలేకి కారణమవుతుందని అనుకుంటున్నాను క్రిందటి శాసనసభలో బిల్లు సామాన్య రూపాలను చెబుతామన్నారు. మేము వస్తుందని ఆశించాము కాని రాలేదు మేము ఇళ్ళకు వెళ్లేసరికి మా ముందుకు ఆర్డినెన్సు తీసుకువచ్చారు ఈ ఆర్డినెన్సు ఉద్దేశంలో లాండు రిఫారమ్సు తీసుకు రావడమా లేదా అనే సమస్య ఉంది. బిల్లులో మాత్రం లాండు రిఫారమ్సు తెస్తున్నామని ఉంది క్రిందటి తడవ వచ్చిన ఆర్డినెన్సులో మాకు అంకెలు కావాలికనుక, వాటిని సేకరించడానికి యీ బిల్లు అవసరముంది కనుక ఆర్డినెన్సు ప్రకటిస్తున్నామని గవర్నరుగారు ప్రకటించారు ఈ అంకెలు 20ఎకరాలకు పైబడ్డవారే ఈయాలని చెప్పారు ఏ 20ఎకరాలు ? అది మాగాణా, మెట్టా ? 20 ఎకరాలు అని పెట్టినందువల్ల "20 ఎకరాలకు సీలింగు పెట్టబోతున్నారు కనుక మనం జాగ్రత్తపడాలని" పెద్ద భూస్వాములు జాగ్రత్తపడడం జరిగింది ఈ సందర్భంలో చాలమంది శ్రీ కళా వెంకట్రావు గారికి చెయ్యెత్తి నమస్కారం చేస్తున్నారు వాళ్ల తండ్రులలో, వాళ్ల మామలలో ఇన్నాళ్ళనుంచీ ఎగ్గొట్టి చూద్దాంలే అని కాలక్షేపం చేసిన వారంతా "ఇది ఎటూపోతున్నది కనుక ఇప్పుడు పోతే ఏమిలే" అని వెంటనే రిజిస్ట్రేషన్ చేసి అమ్మాయికివ్వవలసింది, అల్లుళ్ళకు ఇవ్వవలసింది "ఎటూ పోతున్నది కనుక మీరే తీసుకపొండని" కూతుళ్లకు, అల్లుళ్ళకు ఇవ్వడం జరుగుతోంది తెనాలి తాలూకాలో ఒక సంఘటన జరిగింది. ఒకతను వదలిపెట్టిన భార్యను పిలచి, నాకు యీ చిక్కు వచ్చేటట్లు ఉంది నా మూడవ కుమారునకు నీవు గార్డియనుగా ఉండు నీకూ 10 ఎకరాలభూమి 'ఇస్తాను. వాడికి 25 ఎకరాల

భూమి వస్తుంది. 20 ఎకరాలకంటె ఎక్కువ ఇవ్వడానికి వీలులేదు నీవు గార్డియనుగా ఉండి యీ పది ఎకరాలు అనుభవించు అని చెప్పడం జరిగింది

వాళ్ళంతా రోజూ ప్రార్థన చేసుకొని వెంకటరావుగారికి నమస్కారం చేస్తున్నారు అసలు ఉన్న సమస్య ఏమిటి ? భూమి వస్తుందని ఆశిస్తున్నవారికి, భూసంస్కరణలు వాయిదా పడుతున్నందున నిరాశగా ఉన్నది తీరాచూస్తే, పొలము ఎంతవస్తుందో తేలనటువంటి పరిస్థితి వచ్చింది ఇప్పుడు అంకెలు కావలెనంటే నేను కాదనను అంకెలు లేకుండా ఏ ప్రణాళికా నడవదు మనము తీసుకురాబోయే సంస్కరణలకు ఒక ప్రాతిపదిక ఉండాలి దానికి అంకెలు అవసరం కాని ఈ బిల్లుద్వారా సేకరించబోయే అంకెలవల్ల చేయగలిగేది ఏమిటో నాకు అర్థం కావడం లేదు ఇప్పుడు రిజిస్ట్రేషను డిపార్టుమెంటుకు ఎంతడబ్బు వస్తుందో నాకు అనుమానంగా ఉన్నది ఆర్థికంగా యిబ్బందిపడుతున్న స్టేటుకు కొంతయినా డబ్బువస్తే మంచిదే ఎంతవచ్చిందో నాకు తెలియదు

శ్రీ కె వెంకటరావు ఒక ప్రశ్న వేయండి

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య పంపిస్తాను ఇందులో యింకొక విషయం ఉన్నది Stamps అంటున్నారు అది గవర్నమెంటుకు వస్తే సంతోషమే. కాని రూపాయిస్టాంపు బ్లాక్ మార్కెట్ లో అయిదు, పది రూపాయలు పెట్టి కొంటున్నారు ఇదంతా బ్లాక్ మార్కెట్ లోకి పోతున్నదని దిగులుగా ఉన్నది ఇంత కంగారు దేనికి ? ప్రభుత్వానికిగాని, ప్రజలకుగాని దీనివల్ల ప్రయోజనం ఉన్నదా ? ఉంటే ఫర్వాలేదు వెంకటరావుగారు "వాళ్ళంతా చేసుకొన్నారు ఏమి జరుగుతుందో చూచుకోండి" అన్నారు అందువల్ల ఏమిజరుగుతుందో తెలుసుకుంటే బాగుంటుందని నాకు అభిప్రాయం ఉన్నది ఇక 20 ఎకరాలకన్న చెల్లదు, అంటే ప్రభుత్వాన్ని అభినందించదలచుకున్నాను.

మిస్టర్ స్పీకర్ - మీరు అభినందిస్తే అసలే పోతానంటారు ఆయన

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య వారివాదనను ఖండించుట నా ఉద్దేశం కాదు. నాకంటే వారు senior ఈ బిల్లు ఆంధ్రప్రాంతానికేకాక, ఆంధ్రప్రదేశ్ మొత్తంగా అనువర్తింపచేయాలని నా ఉద్దేశం. తెలంగాణాలో యిదివరకే కొంతవ్యవహారం జరిగింది కనుక, దానికి అనువర్తింపచేయుట ఎందుకు అన

వచ్చును కాని ఆంధ్రప్రాంతంలో భూమి ఎక్కువ ఉన్నవారు తెలంగాణాకు వచ్చి భూమి కొనుక్కొని ఉన్నవారున్నారు. వీళ్ళందరూ అక్కడి లెక్కలలోకి రాకుండా పోతారు కాబట్టి అక్కడి లెక్కలేనా కావలసినది ? ఇక్కడివికూడ కావలెనా ? అతనికి ఉన్న మొత్తం భూమి ఎంతో తెలియాలంటే యిక్కడ లెక్కలుకూడ కావాలి తెలంగాణాలో ప్రొటెక్టెడ్ టెనెంట్ తన భూమి యింకొకరికి అమ్ముకొనుటకు నిషేధం లేదు కాబట్టి ఇక్కడకు వచ్చి కొంత మంది కొన్నారు. వారికి అక్కడ 100 ఎకరాలు ఉన్నది ఇక్కడ 100 ఎకరాలు ఉన్నది ఇదికూడ అంకెలలోకి రాకపోతే దీనిని జాగ్రత్తచేసుకొన్నవాడవుతాడు

తరువాత 20 ఎకరాలుఅని పరిమితిపెట్టుటలో ప్రభుత్వ ఉద్దేశం తెలియుట లేదు. 20 ఎకరాలు మాగాణా ? **Standard acres** 20 ఎకరాలంటే కొంత వరకు మాకు బోధపడేది 20 ఎకరాలు అన్నారు ధర్మవరం తాలూకాలో భూమి శిస్తు 0-2-0. ఇంకొకచోట 10, 13 రూపాయల వరకు ఉన్నది 13 రూపాయలదీ, రెండు అణాలదీ రెండూ 20 ఎకరాలంటే భయంవేస్తున్నది ఏది ఉంచుతారు ? ఇంకొక విషయం, ఉన్న 400ఎకరాల భూమి పంచిపెట్టివేసి నా వద్ద పొలములేదు, లెక్క యివ్వనక్కరలేదు, అంటున్నాడు. ఆయన ప్రాసిక్యూట్ అయినప్పుడు కోర్టులో తేల్చుకొనవచ్చునని అనవచ్చును కాని ఉన్నదానిలో లెక్కలు తీసేది ఎట్లా ? అతని మీద అసలు కేసు పెట్టగలమా ? స్టాండర్డు ఎకరాల లెక్క తయారుచేయమని లోగడ ప్రభుత్వాన్ని అడిగితే తయారుచేశారు స్టాండర్డు ఎకరాల లెక్కయిచ్చారు. ఆనాడు ఆయనకు 20 ఎకరాలు ఉన్నది, అది ఏమయినదని- మన ఉద్యోగస్థులే మళ్ళీ information యిస్తే, దానిని ఆధారపరచుకొని తేల్చవలసియుంటుంది. కాబట్టి అతని మీద కేసుపెట్టాలంటే మన లెక్కలమీదనే ఆధారపడవలసియున్నది. అటువంటప్పుడు ముందు వెనుకలు ఆలోచించకుండా యిది తీసుకువచ్చి లాభం ఏమిటి ? లోగడ రెవిన్యూమంత్రిగారు మెమోరాండం తయారయినదని చెప్పినారు. మేము దానికొరకు ఎదురుచూస్తున్నాము. అది తీసుకువచ్చి, బిల్లు తెస్తే మంచిది. "దొంగలున్నారు, జాగ్రత్త" అంటే దానిని ముందు చూచేది ఎవరు ? దొంగ మాత్రమే జాగ్రత్తగా చూచుకుంటాడు. దొంగకు జాగ్రత్త ఎక్కువ. అందువల్ల ఈ బిల్లు భూములు (పంపిణీ) సర్దుకోవాలని చూస్తున్నవారికి వీలుగా ఉన్నది మూడు నెలల తరువాత లెక్కలు యివ్వమన్నారు మూడు నెలల లోపున తొందరలేకుండా పోతున్నది. ప్రభుత్వము ఇదివరకు ఒక లెక్క తయారుచేసింది అందులో చిన్న పొరపాట్లు ఉంటే ఉండ

వచ్చును సెంట్రల్ గవర్నమెంటు కూడ ఒప్పుకున్నది ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో వ్రాసింది. కాని అవి accurate గా లేవంటున్నారు అందు వల్ల బాధపడనక్కరలేదు ఆ బేసిస్ మీదనే లెక్కతీసుకుందాము 20 ఎకరాల వరకు లెక్క ఉన్నది. అప్పటినుంచీ ఆ భూమి చేతులు మారినట్లయితే దానిని నిషేధించాలని మనవిచేస్తున్నాను అయితే భూమిని ఎవరికి పంచిపెట్టారు ? అది బీదరైతాంగానికి పోవాలంటే, తన కొడుకులకు, కూతుళ్ళకు యిచ్చాడు కొడుకులు, కూతుళ్ళు బీదవాళ్ళయితే నాకు అభ్యంతరంలేదు కాని అసలు సంగతి అదికాదు తన చేతిలోనుంచి జారిపోకుండా చేయవలసిన ప్రయత్నం అంతా చేస్తున్నాడు భూసంస్కరణలు ఆలస్యంచేయటానికి యిది ప్రాతిపదికగా ఉపయోగపడుతున్నది తప్పితే, అవి వెంటనే వచ్చే ఆశ మాకు కనపడుటలేదు అయితే ఈబిల్లుతీసుకువచ్చినారు గనుకయింకా పకడ్‌బందీగాచేసి, alienations ఏమీ లేకుండా చేయటానికి కావలసిన ఏర్పాటుచేసి చట్టం పాస్‌చేస్తే ఏమైనా ప్రయోజనం ఉంటుందని, ఆ ప్రకారం చేయమని కోరుతూ, యింతటితో ముగిస్తున్నాను

*శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ) అధ్యక్షా, భూసంస్కరణలు ప్రవేశపెట్టుటకు ఉద్దేశించి, అందుకు statistics కావాలని ఈ బిల్లు ప్రవేశపెట్టడం జరిగింది ఇంతకుముందు 1955 సం॥ లో ప్రభుత్వం statistics తీసుకొని ప్రకటించింది Holdings ఎంతెంత ఉన్నవో 1 నుంచి 50 ఎకరాలవరకు తీసుకొని ప్రకటించింది అయితే కొంతమందికి ఒక గ్రామములో కాక, ఒక తాలూకాలో కాక, కొన్ని జిల్లాలలో భూములు వ్యాపించి ఉన్నవారున్నారు వాళ్ల విషయమేమిటి ?, ఏ statistics కోసం యీ బిల్లు తీసుకురానటం జరిగింది అలాంటి భూస్వాములు ఉంటే, వారిలెక్కలు calculate చేయుట పెద్ద విషయంకాదు. కాని భూసంస్కరణలు తీసుకురావటం ప్రధాన ఉద్దేశం అయితే, అందుకు తగినవిధంగా సమగ్రమైన లెక్కలు సేకరించేందుకు, మళ్ళీ యిటువంటి బిల్సు మధ్య మధ్య తేవలసిన అవసరంలేకుండా, ఉన్న భూమిని యిష్టం వచ్చినవారికి అమ్మిగాని, లేక మరొకవిధంగా alienate చేసేపద్ధతి అరికట్టి ఒక ఆర్డినెన్సు చేసిఉంటే, ప్రభుత్వంవారి భూసంస్కరణల ఉద్దేశం నెరవేరేందుకు ఎక్కువ అవకాశాలు ఉండేవి. అదిలేకుండా, భూసంస్కరణల కోసం ఈ బిల్లు తెచ్చామని చెప్పుటవల్ల, దానిని అవకాశంగా తీసుకొని భూస్వాములు, 20 ఎకరాలకుపైన ఉన్న భూమిని మాగాణిగాని తత్తుల్యమైన మెట్టగాని calculate చేసి 20 ఎకరాలు ఉంచుకొని, మిగిలినది అన్యాక్రాంతం చేయుట జరుగుతోంది వయస్సువచ్చిన కుమాళ్ళు ఉండి, విభజనలయి స్వంత వ్యావ

సాయం పెట్టుకు చేసుకునేవారి విషయంకాదు, పుట్టబోయే బిడ్డల పేరుమీద కూడ భూమి విభజించటం జరుగుతున్నది "ఎన్ని రకాలుగా భూమి విభజన చేసుకొన్నప్పటికి, రెట్రాస్పెక్టివ్ ఎఫెక్టుతో మనం చట్టం తీసుకురావటానికి అవకాశంఉన్నదని చెబుతున్నప్పటికీ అపోజిషన్ మెంబర్సు మాటిమాటికిలేచి, భూమి పంచుకొంటున్నారని చెబుతున్నారు" అని మంత్రిగారు చెప్పవచ్చును ఇదివరకు ప్రభుత్వమువారు రెట్రాస్పెక్టివ్ ఎఫెక్ట్‌తో లెజిస్లేషన్స్ తీసుకువచ్చినమాటనిజమే కాని ఇదివరకు తీసుకువచ్చిన లెజిస్లేషన్‌కు, రేపు తీసుకురాబోయే లెజిస్లేషన్‌కు తేడాఉన్నది రేపుతీసుకురాబోయే లాండ్ లెజిస్లేషన్ పూర్వముచేసిన లెజిస్లేషన్స్ కన్నా,ఎక్కువ ప్రాముఖ్యత కలదని, చాలమందికి సంబంధించినవిషయమని మనం గ్రహించాలి లాండ్ లెజిస్లేషన్‌ను రెట్రాస్పెక్టివ్ ఎఫెక్ట్‌తో పెట్టటం ఎంతవరకు సాధ్యమవుతుందో ఆలోచించుకోవాలి ఇప్పుడు ఒకసారి భూములను అమ్ముకొన్న తరువాత, విభజించుకొన్నతరువాత, ఆ భూములను లాండ్‌రిఫారమ్స్ క్రిందకు తీసుకురావటం సాధ్యమయ్యేదికాదు భూస్వాములు తమ భూములు అమ్ముకొన్నతర్వాత, విభజించుకొన్నతర్వాత, లాండ్‌రిఫారమ్స్ తీసుకురావటం వృథా అవుతుంది. లాండ్ రిఫారమ్సు తీసుకొనివచ్చి భూమిలేని పేద ప్రజానీకానికి, పాటకజనానికి భూమి పంచటమే ప్రభుత్వ ఉద్దేశ్యమైతే, ప్రభుత్వము ఇప్పుడు తీసుకురావలసిన బిల్లు ఇదికాదు అక్రమ సంబంధాలను, బినామి పట్టా ట్రాన్స్‌ఫర్లను అరికడుతూ, బిల్లునుతీసుకురావలసిఉన్నది అటువంటి బిల్లునుతీసుకువచ్చి, ప్రభుత్వం వెంటనే యీ అక్రమసంబంధాలను, అక్రమపంపిణీలను, బినామీ ట్రాన్స్‌ఫర్స్‌ను అరికట్టి ఉండవలసిఉంది. కాని అటువంటి బిల్లు ప్రభుత్వం తేలేదు అందువల్ల యీ బిల్లు లాండ్‌రిఫారమ్స్ సాధించటానికి ఏవిధంగాను ఉపయోగపడదనే అభిప్రాయంలో ఉన్నాము పెద్దపెద్ద భూస్వాములు తమ భూమినంతా అమ్ముకోవటంద్వారా, విభజించుకోవటం ద్వారా, వారంతటవారే లాండ్‌రిఫారమ్స్ చేసుకొంటున్నారనే అభిప్రాయాన్ని బాధ్యతగల స్థానంలో ఉన్నవారే వ్యక్తపరిచారు అది ఎప్పటికీ సరైనదికాదు 18 ఎకరాలు మాగాణి ఉన్నవాళ్ళు ఇంకో పది ఎకరాలు కొని, 25 ఎకరాలు అట్టే పెట్టుకోటం అన్నది లాండ్ రిఫారమ్స్ క్రిందకురాదు ప్లానింగ్ కమీషన్ చెప్పినా, సోషలిజానికి పునాది వేస్తున్నామని అనుకొనేవారు చెప్పేటటువంటి ఉపన్యాసాల్లో విన్నా, వారు వ్రాసే వ్రాతలలో చూసినా, లాండ్‌రిఫారమ్స్ అంటే ఏమని చెప్పబడింది ? భూమి దున్నుకొనేవారికి, భూమిమీద కష్టపడేవారికి, ఏనాడైతే భూమి సంక్రమింపజేశామో, ఆనాడే మనం లాండ్‌రిఫారమ్స్‌కు పునాది వేసినట్లు అవుతుందని చెప్పబడింది, ఇప్పుడు రి-డిస్ట్రిబ్యూషన్ ఆఫ్ ప్రాపర్టీక్రింద భూమి పంపకం జరుపబడుతోందిగాని, లాండ్ రిఫారమ్స్

బేసిస్ మీద మాత్రం కాదు. రెండవ పంచవర్ష ప్రణాళిక జయప్రదంగా అమలు జరగాలంటే లాండ్ రిఫారమ్స్ తీసుకురావాలని అందరం చెబుతున్నాము "దేశంలో యీనాడు ప్రధానంగా ఉన్న నిరుద్యోగ సమస్యను పరిష్కరించాలంటే భూమికి సంబంధించిన సమస్యలను పరిష్కరించాలి భూ సంస్కరణలను తీసుకు రావాలి ? ఎక్కువభూమి ఉన్నవారినుండి భూమి లాక్కొని, భూమి లేని పేదప్రజానీకానికి, తిండికి అల్లాడే పాటకజనానికి పంచిపెడితే గాని, దేశంలోవున్న నిరుద్యోగ సమస్యను పరిష్కరించలేము కాబట్టి ముందు భూమికి సంబంధించిన సమస్యలను పరిష్కరించాలి" అన్న ఉద్దేశంతో లాండ్ రిఫారమ్స్‌కు ప్రాతిపదిక వేయటం జరిగింది కాని మన ప్రభుత్వము యొక్క ఆలోచనలో యీ ఉద్దేశము ప్రతిబింబించడంలేదు ఇంతకుముందు మాట్లాడిన చంగల్రాయ నాయుడు మొదలైనవారు కొన్ని విషయాలు చెప్పారు. "ప్రభుత్వానికి ఒక రైతే కనుపిస్తున్నాడు (కాని వారి దృష్టిలో రైతు అంటే భూస్వామి) ఒక భూస్వామే కనిపిస్తున్నాడు మంత్రిగారికి నెలకు వెయ్యి రూపాయలు వస్తున్నాయి సెక్రటరీకి మూడు వేలు వస్తున్నాయి ప్లీడర్స్‌కు ఐదు వేలు వస్తున్నాయి. డాక్టర్లకు పదివేలు వస్తున్నాయి నెలకు ఇంతంత ఆదాయం సంపాదిస్తున్నవారి ఆదాయానికిపరిమితి పెట్టకుండా, ఒక్క భూస్వామి యొక్క భూమికే పరిమితి ఎందుకు పెట్టాలని" ఒక వాదన తీసుకువస్తున్నారు ఈ రోజున మనం తప్పకుండా ఎక్కువ ఆదాయం సంపాదించేవారిమీద పన్ను వేసి మనస్టేటుకు హెచ్చు ఆదాయం రావటానికి ప్రయత్నం చేయాలి అందుకు మన టాక్సేషన్ పాలసీని మార్చుకోవలసి ఉన్నది ఆ విధంగా వారు సూచనలు చేస్తే, ఆ సూచనలను బలపర్చటానికి మాకు ఎట్టి అభ్యంతరము లేదు "ఇతరుల యొక్క ఆస్తిమీద, సంపదమీద సీలింగ్ పెట్టకుండా మా భూములకే సీలింగ్ ఎందుకు వర్తింప జేస్తున్నారు ?" అని భూస్వాముల తరఫున లాండ్ రిఫారమ్స్‌ను వ్యతిరేకించేవారు చేసే వాదన చివరకు, "భూమిమీద సీలింగ్ అక్కరలేదు. ఆదాయంమీద కూడా సీలింగ్ అక్కరలేదు" అనే వాదనకు దారితీస్తోంది మొదట లాండ్ సీలింగ్ కాగానే, రెండు వేలు, వెయ్యి, ఐదువందలు రూపాయలు ఆదాయం వచ్చేవారిమీద గ్రేడెడ్ ఇన్‌కంటాక్స్ వేయటం చేయవచ్చు అంతేగాని, లాండ్ సీలింగ్‌ను, పెద్దపెద్ద జీతాలు తీసుకొనేవారికి ఎక్కువ ఆదాయం వచ్చేవారికి పోటిపెట్టి, రెండూ జరగకుండా చేయటమును ఎవరూ మెచ్చుకోరు అన్న విషయాన్ని ప్రభుత్వదృష్టికి తెస్తున్నాను ఎక్కువ ఆదాయం వచ్చేవారినుండి, సమాజానికి, దేశానికి ఎక్కువడబ్బు రాబట్టటానికి ప్రయత్నం చేయాలి. పెద్దపెద్ద జీతాలు తీసుకొనేవారి జీతాలు తగ్గిస్తామని అంటే, దానిని మేము బలపరుస్తాము. వారి జీతాలు తగ్గిస్తామంటే మేము వ్యతిరేకించడం

జరగదు. అంతేగాని, దానికి దీనికి పోటీ పెడితే ఏదీ జరగదు. భూమి సమస్య చాలా ప్రధానమైన స్థానం వహించింది. మన రెండవ పంచవర్ష ప్రణాళిక జయప్రదంగా నెరవేరాలంటే, ప్రజల కొనుగోలుశక్తి పెరగాలి. కష్టపడే బీదప్రజానీకానికి, వ్యవసాయ కూలీలకు, భూమి దున్నుకొనే పేదవారికి భూమి లేకుండాచేస్తే, ప్రజల కొనుగోలుశక్తి పెరగటానికి అవకాశం లేకుండా పోతుంది. కాబట్టి వారందరికి భూమి సంక్రమింపజేయటానికి ప్రభుత్వం పూనుకోవాలి. అందుకు అనుగుణంగా ప్రభుత్వం పనిచేయాల్సి ఉంటుందని చెబుతున్నాను.

నేను గుంటూరు జిల్లాలో విచారించిచూస్తే ఒక సంగతి తెలిసింది. స్పీకర్‌గారు అక్కడ ఉన్నవారిపేర్లు ఇక్కడ చెప్పవద్దని అన్నారు. కాబట్టి చెప్పటంలేదు. కళా వెంకటరావుగారు లాండ్ రిఫారమ్స్ ప్రవేశపెట్టే సమయానికి, అసలు లాండ్ రిఫారమ్స్ పెట్టవలసిన అవసరమే ఉండని పరిస్థితి ఏర్పడుతున్నది. వందల ఎకరాలు ఉన్నవారు తమభూమిని పంచుకోవటం జరిగింది. 25 ఎకరాలు, 30 ఎకరాలు మించి ఎవరూ భూమి అట్టేపెట్టుకోవటంలేదు. ఈ పరిస్థితుల్లో ప్రభుత్వం చేయగలుగుతున్నది ఏమిటి? కృష్ణాజిల్లాలో "నాకు ఇప్పుడే డబ్బు ఇవ్వనక్కరలేదు, నా జమీన్ భూమి అమ్ముతాను, తీసుకో. ఏడాదికి ఇంత చొప్పున పన్నుక్రింద కడుతూండమని" చెప్పి భూములు అమ్ముకోవటం జరుగుతున్నది. మరొకవిధంగా జమీందారీ విధానాన్ని ప్రవేశపెట్టటం జరుగుతున్నది. ఇప్పుడు యీ బిల్లు పాస్ చేస్తాము. మన స్టేటుకు వచ్చే ఉపయోగం ఏమిటి? ఈ బిల్లువల్ల మనకు ఏమి ఉపయోగం కలుగుతుందో నాకు బోధపడటం లేదు. ఈ బిల్లులో ప్రధానమైన విషయం లోపించింది. ఈ బిల్లుద్వారా భూములు అన్యాక్రాంతం చేయబడటాన్ని ఆపు చేయలేము. ఎవరైనా భూములు అమ్ముకొంటూంటే, దానిని నిషేధించలేము. మరి, యీ బిల్లువల్ల ఉపయోగము ఏమిటో నాకు బోధపడటంలేదు. ఇవి మేము చెప్పటమే కాదు. మంత్రులు పర్యటన చేస్తున్నప్పుడు, వారి దృష్టికి కూడ అనేక విషయాలు వచ్చి ఉన్నాయి. కాని, ప్రభుత్వంవారు మరొక ఆర్డినెన్సు చేశారా? చేయలేదు. పైగా భూములు అమ్ముకోవటమును ప్రోత్సహించటం జరిగింది. ఆ విధంగా అనేకమంది తమ భూములను అమ్ముకొంటున్నారు. వ్యవసాయ కూలీలకు, భూమిలేనివారికి మనం ఏమి చేస్తున్నాము? ఇప్పుడు నేను ఓట్లగురించి చెప్పటంలేదు. వ్యవసాయ కూలీలు ఎవరికైనా ఓటు వేయనీయండి. ప్రతిరోజు వోట్లగురించి ఆలోచించవలసిన అవసరం లేదు. వ్యవసాయ కూలీలకు, పాటకజనానికి, భూమిలేని పేద ప్రజలకు యీ బిల్లు

ఉపయోగపడుతుందా అన్నది చూడాలి ఈ బిల్లు వారికి ఉపయోగపడుతుందా లేదా, అన్నది చూడవలసిన అవసరం ఉన్నదని మీద్వారా మంత్రిగారి దృష్టికి తీసుకువస్తున్నాను సుందరయ్యగారు కొన్ని లెక్కలు చెప్పారు 20 స్టాండర్డ్ ఎకరాలు తీసుకొని, ఆ ప్రకారం పరిమితి పెట్టినా, పేదప్రజలకు పంచటానికి మిగులుతుంది ప్రభుత్వం ఇచ్చిన లెక్కల ప్రకారం చూసుకొన్నా భూమి తప్పకుండా మిగులుతుంది కాని గోపాలరెడ్డిగారు యీ శాసనసభలోనే, నాలుగు లక్షల ఎకరాలుకూడ మిగలదని చెప్పినట్లు నాకు గుర్తు అది ఎంతమాత్రం సరికాదు లాండ్ హోల్డింగ్ 20 ఎకరాలు పెట్టి, అంతకుపైన ఉన్నవారి దగ్గర నుండి భూమి తీసుకొంటే, దాదాపు 7 లక్షల స్టాండర్డ్ ఎకరాలు బీదలకు పంచటానికి భూమి దొరుకుతుంది ఆ 7 లక్షల స్టాండర్డ్ ఎకరాలను మామూలు ఎకరాలక్రింద కన్వర్ట్ చేసిచూస్తే, దాదాపు 16, 17 లక్షల ఎకరాలు భూమి పేద ప్రజలకు పంచటానికి మిగులుతుంది అవిగాక బంజరుభూములు ఉన్నాయి వెంటనే సాగుళోనికి తీసుకురావటానికి వీలైన బంజరుభూములు 13 లక్షల ఎకరాలు ఉన్నాయి ఆంధ్రప్రాంతంలో మొత్తం 30 లక్షల ఎకరాల బంజరు భూమి పేదలకు పంచటానికి ఉన్నది 20 ఎకరాలు సీలింగ్ పెడితే, దాదాపు 31 లక్షల ఎకరాల భూమి ఆంధ్రప్రాంతంలో పంచటానికి వీలుంటుంది. వ్యవసాయ కూలీల కుటుంబాలు, పాటకజనం కుటుంబాలు, భూమిలేని పేదరైతుల కుటుంబాలు ఇవి మొత్తం 15 లక్షలకంటే ఎక్కువలేవు కాబట్టి యీ భూమినంతా వారికి పంచితే, ఒక్కొక్క కుంటుంబానికి తేలిగ్గా రెండున్నర ఎకరాలు వస్తాయి,

అందువల్ల మనము ఏ land reforms తీసుకుని వచ్చినాసరే, అందరికీ మనము భూమిని పంచగలమా, ప్రతివారికి మనము భూమి పంచగలమా, ఒక్కొక్కరికి సెంటువస్తుందో, కుంట వస్తుందో, ఎంతవస్తుందో అని ఆలోచిస్తే చివరికి ఏమీలేదని చెప్పడమే కన్పిస్తున్నది లెక్కలను తీసుకొని చెప్పేమాట ఎన్నటికీకూడ జరగదు. అంతేకాకుండా మనము యింకొక్క అడుగు ముందుకు పోవటానికి ఆలోచనచేయాలి ఈ రోజున ఎక్కువమందికి భూమి లేకపోయినా, కనీసము ఒకపూట అయినా తిండికి ఉండేటట్లుగా భూసంస్కరణలు ప్రవేశపెట్టాలని అంటే, అంతకంటే అందులో ఎంతెంత పండుతుందో, ఎంతమందికి ఎంతెంత ఆదాయము వస్తుందో అనేవివరాలు అయినా ఉంటే, కనీసము పండిన పంట అయినా పంచిపెట్టగలుగుతాము అనే ఆశ అయినా మనకు పూర్తిగ ఉన్నది అందువల్ల మనము యీ విషయమును గురించి చర్చించుతున్నప్పుడు, అసలు ప్రభుత్వము లెక్కలు సేకరించడమనే విధానము, ప్రాతిపదిక తప్పులనే

అభిప్రాయములో మేము ఉన్నాము తెలంగాణాలో భూసంస్కరణలు ప్రవేశ పెట్టారు అది చాలా లోపభూయిష్టముగ ఉన్నదని చెబుతున్నారు అది లోప భూయిష్టముగ ఉంటే ఉండవచ్చు ముఖ్యంగా తెలంగాణ ప్రాంతమునకంత టికీ అయినాసరే ఒక ఖమ్మం జిల్లాకు మాత్రమే దానిని వర్తింపజేసి, అమలులో పెట్టడము అంటే అది ఎంతమాత్రము సంతృప్తికరముగ ఉండదు అందులో అప్పటి ప్రభుత్వము చేసిన ప్రయోజనము ఏమిటి ? భూసంస్కరణల బిల్లు ప్రవేశ పెట్టేముందు ఒక కమిషనును వేసి, అటుతరువాత బిల్లుతెచ్చి ప్యాసు చేశారు ముందుగ లెక్కలు తీసుకోటానికి ప్రయత్నిస్తున్నట్లు, లెక్కలు లేనట్లు, లెక్కలు వస్తున్నప్పటికినీ అది తెలియదని చెప్పడము కన్పిస్తున్నది అందువల్ల యివి అన్నీ చూచుకున్నప్పటికినీ, యీ బిల్లువల్ల ఎంతమాత్రము ఉపయోగముగ కన్పించడములేదు భూసంస్కరణల బిల్లువచ్చేలోగా ఎన్నో alienations, బినామీ transfers జరిగినవి ఇవి లేకుండ చేసిననప్పుడే, యీ బిల్లు సద్వని యోగము అవుతుంది లేకపోతే యీ బిల్లు తెచ్చినందువల్ల ఏమీ ఉపయో గము ఉండబోదు అని మీ దృష్టికి తెస్తున్నాను నిరుపయోగమవడమేకాకుండా, అనేక ప్రాంతాలలో అన్యాక్రాంతాలు కూడ జరుగుతున్నవి. ఇవి వెంటనే ఆపుజేయాల్సిఉన్నది ఇది ఆపుజేయగలశక్తి యీ బిల్లులోలేదు. ఇది చాలా అవసరము మంత్రిగారు దీని విషయమై ఆలోచించటానికి తగినచర్య తీసుకో టానికి కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

శ్రీ యన్. పి. చంగల్రాయ నాయుడు On a point of personal explanation, Sir గౌ॥ సభ్యుడు వెంకటేశ్వర్లుగారు మాట్లాడుతూ మంత్రుల జీతాలపైన సీలింగుపెట్టాలని నేను చెప్పినట్లుగా చెప్పారు. నేను ఆవిధముగ చెప్పలేదు మంత్రుల జీతాలస్థాయికి రైతులనుకూడ తీసుకుని రావాలని చెప్పాను

శ్రీ కె. వెంకటరావు : అధ్యక్షా, ఈనాటి చర్చలను గురించి ఏమని సమాధానము చెప్పాలో నాకేమి అర్థముకావడము లేదు దీనిని గురించి యిప్పటికి అరగంటసేపటి నుంచి నేను ఆలోచిస్తున్నాను ఎందుకంటే, యీ బిల్లుకు సంబంధించిన చర్చ జరిగి ఉంటే, నేను సమాధానము చెప్పటానికి వీలుగా ఉండేది అందువల్ల దీనిని గురించి ఏమిచెప్పాలో తెలియశంలేదు. Political philosophy లో మనకు ఉన్న భావాలన్నీ యీ బిల్లులోకే తీసుకుని రావాలనే భావంతో చాలామంది చర్చలకు దిగారు. సమయాను కూలంగ ఏ ఉద్దేశ్యముతో ఏ బిల్లు ప్రవేశపెట్టబడుతున్నదో, ఆ బిల్లుకు

సంబంధించి ఒకరూపము తెప్పించాలని ప్రభుత్వ పక్షానికి ఆశ ఉన్నది దానిని యింకా ఒకరకంగా పెట్టాలనే కోరిక ప్రతిపక్ష సభ్యులకు ఉండవచ్చు వారు చెప్పటములో న్యాయము ఉన్నది కాని వీలు అయినటువంటివి వినాలి వీలు కానటువంటివి కూడదు అని చెప్పాలి కాని యీ రోజున సభ్యులముందు ఉన్న బిల్లు సందర్భములో ప్రభుత్వానికి ఉన్న అవసరముకొద్దీ ప్రభుత్వమువద్ద నున్న లెక్కల సంఖ్యల సేకరణలో కొన్ని లోపాలు ఉండినందువల్ల యీ లోపాలన్నీ సరిదిద్దుకోవాలనే ఉద్దేశ్యముతోనే యీ బిల్లును తేవడమైనది అంతకుమించి మరేమిలేదని నేను మనవి చేస్తున్నాను ఈ లోపాలు ఉండడము వల్ల రేపురాబోయే భూసంస్కరణల బిల్లుకు సహాయము కలుగుతుందా అనే విషయముకూడ నిజమే ముందురాబోయే భూసంస్కరణలకు సంబంధించిన బిల్లుకొరకనే కానివ్వండి, దేశములో ఉన్న పరిపాలనా వ్యవస్థలో కావలసిన సౌకర్యాలు కలుగజేసుకోటానికి అనుకోండి, యీ లెక్కలు చాలా అవసరము అందుకోసము తీసుకునివచ్చిన బిల్లులో కాదు, యిందులోనే భూమియొక్క కనిష్ట, గరిష్ట ప్రమాణములు అన్నీ తీసుకుని రావలసింది దాన్ని దృష్టిలో పెట్టుకుంటే యిన్ని లక్షల యకరాలు మిగులునని తెలిపి ఉండేదని అన్నారు ఈ సందర్భములో M L A Cinema సంగతి కూడ సభ్యులు చెప్పారు "ఆయనకు కొడుకు పుట్టుతాడని అనుకుంటే, కూతురు పుట్టిందట" అనేసంగతి ప్రతిపక్ష నాయకులు, యితరులుకూడా చెప్పారు సినీమాలలోకూడ మనము చూస్తూనే ఉంటున్నాము నాకు నిజానికి ఇప్పుడు సినిమాలకుపోయే అలవాటులేదు కాని, ఎప్పుడో వెళ్ళేరోజులలో నేను చూచే వాడిని ఇలా కూర్చోబెట్టి బొమ్మను వేస్తూంటే, అందులో world picture అంతా కంటికి కన్పిస్తున్నట్లు ఆ పాతవిషయాలు అన్నీ జ్ఞాపకమునకు వస్తున్నట్లు, ముందు జరగబోయేవి తెలిసేటట్లు వేస్తూ ఉండేవాళ్ళు అదేమాదిరిగ రేపు రాబోయే భూసంస్కరణవల్ల ఏమి జరగబోతుంది ? దాని వల్ల నలభై లక్షల యకరాలు వస్తాయి అని ఒకరు, ఎంత ఖచ్చితముగ లెక్కలు తీసుకున్నప్పటికినీ, కనీసము 16 లక్షల ఎకరాలు అయినా వస్తాయి అది తప్పకుండా పంచిపెట్ట వచ్చు అనే ఆశ ప్రజలలో కల్పించి, దీని ద్వారా కూడ ఒక political capital బైటికి తీసుకుని వద్దామని ఉపన్యాసాలు జరిపితే, యిక నేనేమని ఉపన్యాసాలు చెప్పాలి అని ఆలోచించుకోవలసిన పరిస్థితి ఏర్పడుతున్నది అందువల్ల నా మనస్సులో ఖచ్చితముగ ఉన్న ఉద్దేశ్యములు నేను మీకు తెలియజేస్తున్నాను

ఇప్పుడు ప్రభుత్వమువద్ద ఉన్న లెక్కలు చాలా లోపములతో ఉన్నవి. ఈనాడు ఆంధ్రప్రాంతములో ఉన్న 11 జిల్లాలలో ఏ వ్యక్తికి ఎంతెంత

భూమి ఉన్నది అనే విషయము ప్రభుత్వముయొక్క దృష్టిలో లేదు అయితే పెద్దపెద్ద ఉపన్యాసాలు మాత్రము దీనినిగురించి చేశారు Ordinance లో "family" అనేమాట చెప్పలేదు గనుక ఒకవ్యక్తి అనగానే, వ్యక్తికి ఉన్న భూమి వ్యక్తిక్రిందికి పోతుంది అని, అన్నారు కాని ordinance ను మరొక సారి కొంచెము జాగ్రత్తగా చదువుకోమని సభ్యులను కోరుతున్నాను. 1957 వ సం॥ 21 వ సెప్టెంబరు తారీఖున Hindu joint family లో పిల్లలు ఎంతమంది ఉన్నా, లేకపోయినా ఆకుటుంబయజమాని పేరుతో ఉన్న భూమి ఎంతో చూపించవలసిందనే ఆ ordinance లో వ్రాయబడియున్నది. కాని మరొకటి ఏమీలేదు అదే దానియొక్క ఉద్దేశ్యము కాని ఈ ordinance దరిమిలాన ఎవరో భూములన్నీ పంచుకుంటున్నారు ఎన్నో benami transfers చేస్తున్నారు, అవి అన్నీ ప్రభుత్వము నిషేధించలేదు, అపుదల చేయలేదు, అని చెప్పడము సాగించారు నిజానికి దానికి, దీనికి ఎలాంటిసంబంధము లేదు కలెక్టరు పర్మిషను లేకుండా ఎవ్వరుకూడా భూమి అమ్మకూడదు, కొనుక్కో కూడదు అని The Hyderaberd Tenancy and Agricultural Lands Act, 47 వ సెక్షనులో ఉన్నది అయినా సెక్షనులో పెట్టడములోనే, యివి అన్నీ అమలులోనికి రావు ఈ సంస్కరణలు అన్నీ ఎంతో కుదిమట్టముగా, ఎంతో కాలము దానిమీద బుద్ధి, శ్రద్ధ వినియోగించి చేస్తే, అప్పుడు అవి అమలు లోనికి వచ్చేవిషయాలు వాటిని అన్నీ యిప్పుడు యీ చిన్నబిల్లులో తీసుకొని వచ్చి ప్రవేశపెట్టండి అని కోరడము న్యాయముకాదు, మనకు ఎన్నో భావాలు ఉంటాయి అవిఅన్నీ యీ బిల్లులో పెట్టడమంటే సాధ్యమయ్యే పనికాదు ప్రభుత్వానికి వీలుకానటువంటి విషయాలను, భావాలను, పెట్టటానికి యీ బిల్లులో వీలుండదు ఏఏ వ్యక్తికి ఎంతెంత భూమి ఉన్నది అనేది మొట్టమొదటి ప్రశ్న జాయింటు కుటుంబములో ఉన్నవారికి ఆర్డినెన్సుకు దరిమిలా పంచి పెట్టుకున్నవ్వటికినీ, అంటే 1957 వ సం॥ 21 వ సెప్టెంబరు తేదీ తరువాత నూట ఇరవై ఎకరాలు ఉన్నవారు, ఎనిమిదివాటాలు అంటే ఒక్కొక్కరికి 15 ఎకరాలు చొప్పున వచ్చినను, ఆ నూటఇరవై ఎకరాలు ఎవరిపేర ఉన్నప్పటికినీ, ఆ యజమాని ఎవరో ఆయన పేరులో చూపించమనే యీ ordinance ఉన్నది గాని మరొకటి ఏమీలేదు. కాబట్టి యిప్పుడు దీనినిగురించిన విమర్శ అప్రస్తుతమని అంటున్నాను

శ్రీ పి. సుందరయ్య - మంత్రిగారు యిప్పుడు చెప్పిన విషయము యీ బిల్లులో ఏ క్లాజుక్రిందకు వస్తుందో చెబుతారా ?

శ్రీ కె వెంకటరావు - దీనికి సంబంధించిన legal opinion కూడ తీసుకుని వచ్చాను అది ఇక్కడ నావద్ద సిద్ధముగానే ఉన్నది

శ్రీ పి. సుందరయ్య.- ఆ legal opinion అటు వుంచండి, ఇప్పుడు యీ విషయము బిల్లులో ఏ క్లాజు క్రిందకు వస్తుందో చెప్పండి

శ్రీ కె వెంకటరావు ,- మేము అందరము Law మీద ఆధారపడవలసి ఉన్నది Law వద్దనే వారికి ఏదీ లెక్కలేదు Law కావాలనే వారికి తప్పదు

శ్రీ పి సుందరయ్య ,- నేను Law వద్దని చెప్పడములేదు కాని మంత్రి గారు చెప్పినది యిందులో ఏ క్లాజు క్రిందకు వస్తుందో, అందులో అది legal అని దేనికి అర్థము వస్తుందో చెబితే, మేముకూడ ఆలోచించటానికి వీలు అవుతుందిగదా

శ్రీ కె వెంకటరావు Legal opinion చదువుతున్నాను.

"Under section 3 of the Ordinance even the land-holder of a holding the total extent of which exceeds 20 acres of land on the date of commencement of the Ordinance is required to furnish a declaration of the holding as on that date to the Tahsildar within whose jurisdiction his holding or any part thereof is situated Where a land is held by two or more landholders jointly, only that portion of it which belongs to the share of each landholder shall be deemed to be included in his holding Certain doubts appear to have been raised in regard to the applicability of the ordinance with particular reference to the wording of the above explanation, in the case of holdings owned by undivided Hindu family, where the total holding exceeds 20 acres, but where the individual shares would be less than 20 acres each if the family property were to be partitioned; the correct position is that the explanation referred to above applies only to cases where two or more landholders own land jointly, i e. to cases where for instance more than one person held land under the joint patta, a similar position would arise in the case of joint Hindu family who have got themselves divided and have not chosen to apply for separate revenue registry. In the case of joint Hindu family, however, which has remained undivided, there is really only one landholder, namely,

the undivided Hindu joint family itself Such being the case, the explanation referred to above does not apply to the holdings of an undivided Hindu family The position in such cases therefore is that when an undivided Hindu family owns land exceeding 20 acres, that family will have to furnish a declaration though each of the sharers in such family might on partition be entitled to less than 20 acres each " ఇది ఉన్నటువంటి పరిస్థితి

ఇక తరువాత విషయము ఏమిటంటే భూమియొక్క సారములో ఉన్న తారతమ్యములను గురించి విమర్శలుకూడ వచ్చినవి దానికి దీనికి సంబంధము లేదు ఇప్పుడు భూమి అంటే, అది ఏ స్వరూపముకలది, అది ఎన్ని ఎకరాలు ఉండాలి అనేది హైదరాబాదు యాక్టులోకూడ లేదు తరువాత Land Commission అనే ఒక కమిటీని వేశారు వారు ఫలానా region లో ఫలానా విధమైన భూమి వగైరాలు అన్నీ నిర్ణయించారు ఇప్పుడు ఉన్న హైదరాబాదు ల్యాండుయాక్టు ప్రకారము ceiling ముందు 31½ ఎకరాలతో మొదలుపెట్టి, ఒకరకమైన మాగాణిభూమి చివరికి 270 ఎకరాల మెట్టభూమి దాకా వెళ్ళింది అది actual quality of the soil ను బట్టి, అక్కడ ఉన్న యితర పరిస్థితులనుబట్టి నిర్ణయించుకోవలసిన విషయము మీకు 20 ఎకరాలు ఉన్నదా, లేదా, అంటే, అది మాగాణా ? మెట్టా ? అది standard ఎకరమా ? అనే విమర్శనకు యిది అదునుకాదు మనము Land Reforms Bill తీసుకుని వచ్చినప్పుడు, అది అంతా మనము ఆలోచించుకోవలసిన అవసరము ఉంటుంది ప్రభుత్వం యీ alienation ను prevent చేయడం లేదనేది మూడో విమర్శ దానికి సమాధానం ముందు ఉపన్యాసంలోనే చెప్పాను Alienation ఎక్కువై ప్రభుత్వాన్ని దగా చేసే ఉద్దేశ్యంలో వ్యవహారం జరిగితే దానిని ఎలా అరికట్టడం అనేది తగిన సమయంలో ఆలోచించవలసిన పరిస్థితి యేర్పడుతుందని నాయొక్క నమ్మిక తరువాత భూదానం గురించి శ్రీ సుందరయ్యగారు మాట్లాడుతూ శ్రీ వినోబాభావేగారికిచ్చినవన్నీ రాళ్ళు రప్పలు వుంటాయి కొద్దిమంది మాత్రమే మంచివి యిచ్చివుంటారని దానిమీద అపనమ్మకం వెలిబుచ్చారు. నేను ఇదే ప్రశ్న శ్రీ వినోబాభావే తూర్పుగోదావరి జిల్లాలో ప్రవేశించినప్పుడు తునిలో ఆయనను అడిగాను "బాగావుండే భూమి వున్న వాడిని ఎక్కువగా యివ్వమంటే యివ్వడు, ఇచ్చింది మనం పుచ్చుకోక పోవడం యేమిటి ?" అనే ప్రశ్న వేశాను ఆయన యేమి చెప్పారంటే,

आसमान है। ज़मीन है। मै छटा चाहूँ।

"ఆకాశం వుంది, భూమి వుంది ఏరకం భూమయితేనేం, తనకున్న దాంట్లో అది మంచో చెడో ఆరోపెంతు యిచ్చే స్తేచాలు" అని ఆయన సమాధానం చెప్పారు

శ్రీ పి సుందరయ్య అది మంత్రిగారికి సంతృప్తి కలిగించిందా?

శ్రీ కె వెంకటరావు నేను యివ్వడం మంచిభూమి యిచ్చాను కనుక నాకు సంతృప్తి కలిగించింది వారి ఉపన్యాసంలో "పంచినట్లయితే 2 ఎకరాలు పల్లపుభూమి, 6 ఎకరాలు మెట్టభూమి వస్తుంది" అని చెప్పారు అది అప్రస్తుతం కనుక నేను దానిని గురించి చర్చించదలచుకోలేదు ఇంకో రెండు మాటలు మాత్రం మనవి చేయదలచుకున్నాను ఇంతవరకు clarification అడిగింది శ్రీ గింజుపల్లి బాపయ్యగారి speech ఒకటే, ఆయన స్వల్పంగా చెప్పినప్పటికీ మూడు విషయాలు చెప్పారు "ఒక అన్నగారు ముగ్గురు అన్నదమ్ములకు వాటాలుంటే అందరికీ కలిపి చూపెట్టాలా లేదా?" అని అడిగారు 21 సెప్టెంబరున ఎలావుంటే అలా చూపించాలి ఆవేళకు పంచుకోడం అయిపోతే అలా చూపాలి, పంపకం పూర్తికాక అందరూ కలిసి ఒకటే కుటుంబం క్రిందవుంటే మొత్తం చూపించాలి తరువాత "ఏ తారీఖుకి సంబంధించి" అన్నారు అది అర్డినెన్సు తేదీ, అనగా సెప్టెంబరు 21 వ తారీఖు. రైతులకు సంజాయిషీ యివ్వడంలో కష్టమవుతుందని చెప్పారు ఇదివరకే గ్రామకరణం దగ్గరనుంచి కలెక్టరువరకు గల ఆఫీసర్లందరికీ instructions పంపించాము ఎవరైనా సంజాయిషీ అడిగినట్లయితే యివ్వవలసిన బాధ్యత వారిపైవుంది, ఒకవేళ వారు యివ్వరంటే కాగితంమీద వ్రాసి ప్రభుత్వానికి తెలియపరుస్తే తగినటువంటి చర్యకూడా తీసుకోబడుతుంది తరువాత penalties తీసివేయవలసినదిగా వారు అభిప్రాయాన్ని వెలిబుచ్చారు రైతులు వెర్రివాళ్ళని వారి అభిప్రాయం ఈ శాసనసభలో నాతో కలుపుకొని మన అందరికంటె ఎక్కువగా వ్యవసాయమును గురించి రైతుకు తెలుసును ఏరోజు పొలంలో ఎరువు వెయ్యాలో ఏరోజున ఊడ్చాలో, ఏరోజున కొయ్యాలో, ఆకాశం ఎర్రపడితే వానవస్తుందో వరదవస్తుందో అనే commonsense లో, భారతదేశంలో అందులో ముఖ్యంగా ఆంధ్ర ప్రదేశంలోని రైతును ప్రపంచంలో ఎవరూ ఓడించేవారు లేరు అక్షరజ్ఞానం లేకపోవచ్చును గాని లోకజ్ఞానం లేదనే అపోహపడడం ఉపన్యాసాల కుపయోగించవచ్చును, గాని నిజమయిన విషయం కాదు అందువల్ల 10 ఎకరాలుంటె అంటే రెండుసెంట్లు తేడావస్తే కొంప మునిగిపోయిందా? అంతమాత్రంచేత యేమీపోదు, సంజాయిషీ కోసమని అడిగే విషయంలో

ఎవరినీ బాధ పెడుతామని అనుకోడానికి వీలు లేదు. కాని ఒకందుకు నా మనస్సుకు యిందాకా కష్టం తోచింది ఇప్పుడూ కష్టం తోచింది ప్రభుత్వాన్ని బలపరిచేవారే, "మాకు యీ reforms లో నమ్మకంలేదు" అనో "reforms చేస్తారని ప్రభుత్వంలో నమ్మకంలే"దనో చెప్పడం మాత్రం కొంచెం కష్టం తోచింది, కాని మీరు యిచ్చిన ruling క్రింద ఆ కష్టాన్ని యిప్పుడు వెలిబుచ్చదలచుకోలేదు ఇంకో form లోకి వెళ్ళవచ్చు, ఇంక తెలంగాణా Act లో కూడా proper definition లేదని చెప్పారు అది దీనికి సంబంధించినదికాదు ఇంకో ముఖ్యమైన విషయం stamps గురించి Black market లో తేదీ ముందర వేసి కొనుక్కుని సెప్టెంబర్ 21 తేదీకి అప్పుడే division ఐపోయింది' అని చెప్పడంకోసమని register చేయిస్తున్నారని చెప్పారు ఒక సంగతి వారుయోచించడంలేదు Stamp vendors యొక్క store room లో చాలా stamps వుండవు, లేవని నేనుచెప్పడంలేదు కొద్దిగా ఉంటాయి ఈరకమైన execution జరవడానికి రూపాయి, రెండు రూపాయిల stamps పనికిరావు కొంచెము ఎక్కువ value వున్న stamps వుండాలి వేలాది రూపాయలు పెట్టుబడి పెట్టుకుని stamps కొని దగ్గర పెట్టుకుని black market చేయగలిగిన సామర్థ్యం stamp vendors కు వుండదు దేశంలో అందరికిని కలిపినా ఉండదు, ఎప్పటికప్పుడు treasury లో requisition యిచ్చి stamps తెచ్చుకోవాలి అందుచేత ఏ రోజు stamps తెచ్చుకున్నాడో దానికి దరిమిలా issue చేసినట్లు date endorsement వుంటే previous గా వేస్తే తప్పకుండా దొరికిపోతుంది, అంత తెలివితక్కువగా డబ్బు ఖర్చుపెట్టి చేయరు చాలమంది అటువంటి పని చేశారని అనుకోడానికి practical difficulties వున్నాయి అందుకు ఆస్కారం లేదని మనవి చేస్తున్నాను శ్రీ సుందరయ్యగారు "40 లక్షల ఎకరాలు చాలమందికి యివ్వవచ్చునా" అంటే శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు "అందరికీ పొలం'' అని inverted commas లో అన్నారు ఇది అసంభవమైన విషయము భారతదేశంలో ప్రతి మనిషికి పొలం అందడం అనేది అసంభవమైన విషయం. కొంతమందికి వస్తుంది చాలామందికి వస్తుంది. ఎక్కువమందికి వ్యవసాయం చేసుకునే ఆధారం కలుగవచ్చును, గాని దేశంలో వున్న ప్రతి వ్యక్తికి పొలాన్ని అందించే పరిస్థితి భూమియొక్క వైశాల్యాన్ని బట్టిగాని, శ్రీ గోపాలకృష్ణయ్యగారి మిత్రులు చేసే కృషివల్ల ఎదిగే జనాభాను బట్టిగాని అందరికీ వస్తుందని అనుకోడం చాలా పొరపాటైన విషయం

**శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య :** అందరికీ అని ఎప్పుడూ నేను చెప్పలేదు.

శ్రీ కె వెంకటరావు అందరికీ పొలం అని వారి నోటినుంచి వచ్చింది ఇక్కడ note చేసుకున్నాను

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య 'ఎక్కువ మందికి' అన్నాను

శ్రీ కె వెంకటరావు 'ఎక్కువమంది' ఇందాక అనలేదు ఇప్పుడు అంటున్నారని అంగీకరిస్తున్నాను కేసులు పెడతారనే విషయం చెప్పారు ఒక్క case కూడా పెట్టాలనే కోరిక ప్రభుత్వానికి లేదు Penalty సృష్టిలోనే వుంది నేను యేమి చేయగలను ? లోతు నీళ్ళలో దిగితే కనిపించరు దేముడే వ్రాశాడు penalty. మనం శాస్త్రంలో వ్రాస్తున్నాం అంతే ఒక నిర్ణయం ప్రభుత్వం చేశాక దాని ప్రకారం చేద్దాం అని యత్నం చేస్తారు సహాయం యివ్వడానికి ఏర్పాటు చేశాము ఒకవేళ ఎవరయినా దగా చేస్తున్నారంటే దానికి ప్రతిక్రియ చేస్తాం అని నేను మనవిచేస్తున్నాను అందువల్ల case ను పెట్టాలనే కోరిక ఎవరికీ లేదు ఒక case అయినా file చేయవలసిన ఆవశ్యకత లేకుండా చేయవచ్చు Embarrass చేసి బాధపెడతారంటే, rules లో ప్రభుత్వం దానికి తగిన బందోబస్తు చేస్తుంది శ్రీ గోపాల కృష్ణయ్యగారు ఆఖరున ఒక warning యిచ్చారు "దొంగలున్నారు జాగ్రత్త" అని నేను వారికి చేసే మనవి యేమిటంటే, దొంగలభయము లేదు చాలమంది ప్రతీతిలోనే వుంటారు జేబుదొంగలున్నారు జాగ్రత్త అని వారు దృష్టిలో పెట్టుకోవాలి

శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు (నర్సీపట్నం-జనరల్) • ఇప్పుడు estate areas లో survey కానిభూములున్నాయి ఆ acreage లో పొరపాటు లుంటే దానికి బాధ్యత ఎవరిదని అడుగుతున్నాను

శ్రీ కె. వెంకటరావు. దానికి సైమాయిషీ సర్వే వుంది. ఉజ్జాయింపు గానే యీయమన్నాం గాని, సమంగా అడుగులుకొలిచి వేయమనలేదు. పన్ను ఏ లెక్కల ప్రకారం చెల్లిస్తున్నాడో సర్వే కానటువంటి భూమికి ఆ ఎకరాల చొప్పున యిచ్చినట్లయితే సరిపోతుంది.

శ్రీ జి బాపయ్య • కొంతభూమి బాకీలక్రింద పోతుంది ఆ పోయిన భూమినికూడా కలిసి owner యివ్వవలసి ఉంటుందా లేక అది వదిలిపెట్టియివ్వ వలసి వుంటుందా ?

శ్రీ కె. వెంకటరావు . 21 తరువాత యీ లెక్కలతో సంబంధం లేదు

శ్రీ జి. బాపయ్య ముగ్గురు సోదరులు పారీఖత్తు వ్రాసుకుంటారను కోండి ఆ accounts ను produce చేయవలసినవారు ఎవరు ?

మిస్టర్ స్పీకర్ Manager

శ్రీ జి బాపయ్య Manager కు బాధ్యత వుంటుందా ?

మిస్టర్ స్పీకర్ నాలుగవ సెక్షను ప్రకారం Manager కు బాధ్యత వుంటుంది

శ్రీ యం సత్యనారాయణరాజు (చీపురుపల్లి-జనరల్) ఈ ordinance భూసంస్కరణల కోసమని లెక్కలు సేకరించడానికే అన్నారు నాకు అనకాపల్లి తాలూకాలో 10 ఎకరాలు, తూర్పుగోదావరిజిల్లాలో 9 ఎకరాలువుండి మొత్తం 20 వేల రూపాయలు ఆదాయం రావడానికి అవకాశం వుంది. కాని నా లెక్క ప్రభుత్వానికి రాదు భూసంస్కరణల ఆశయం ప్రకారం అంత ఆదాయంగల భూమి నా కుండకూడదు అది 20 ఎకరాల లోపు వున్నందున యీ లెక్కలలోకి రాదు. అప్పుడేమి చేస్తారు ?

శ్రీ కె. వెంకటరావు ఇందాకటినుంచి చెప్పినా శ్రీ సత్యనారాయణ రాజుగారి సందేహం పోలేదు ఇవ్వాళ యిచ్చిన census లో వున్న భూమిని legal document గాతీసుకొని వారియొక్క net income గాని, gross income గాని calculate చేయడానికి యిది basis కాదు ఇది ఎంతవరకు basis అంటే, యీ బిల్లు పెట్టడంవల్ల social effect ఎంత ? 5 లక్షలమందికి పెడతామా, 50 లక్షలమందికి పెడతామా, 5 గురికే పెడతామా, దీనియొక్క tenor ఎలావుంది ? అని చూసుకోడానికి, ఎలా apply చేయాలనేదానికి యీ ordinance లోని భోగట్టాకు సంబంధం లేదని మనవిచేస్తున్నాను

మిస్టర్ స్పీకర్ . అంతేకాకుండా ఒక Commission ను వేస్తారు వారు ఒక్కొక్క తాలూకాలో 10 ఎకరాలో ఎంతో పెడతారు. ఇప్పుడు దానికి సంబంధం లేదు.

శ్రీ యం సత్యనారాయణరాజు ప్రభుత్వానికి యీ భోగట్టా రాదుకదా?

మిస్టర్ స్పీకర్ కమీషనువారు బయలుదేరినప్పుడు వస్తుంది ఒకవైపున 10 ఎకరాలు వస్తుంది ఇంకోవైపు 100 ఎకరాలు వస్తుంది మరొకవైపు 300 ఎకరాలు వస్తుంది ఒక area లో average ఎంత వుందని తీసుకోకతప్పదు లేకపోతే income question వుంది అందువల్ల 20 ఎకరాలకు తక్కువ యిప్పుడు రాకపోయినా అప్పుడు ఎట్లానూ వస్తుంది

శ్రీ యం. సత్యనారాయణరాజు అప్పుడు యీ బిల్లు అనవసరం

మిస్టర్ స్పీకర్ ఉన్నంతవరకు ఉపయోగం 20 ఎకరాలకు కొంచెం ఏమాత్రం తక్కువగా వున్నా technical గా దీని క్రిందికి రాదు ఆదాయం పన్ను 3,600 పైనున్నవారికి వుంటే 3,500 రూపాయలు వచ్చేవారికి పన్ను పడదు ఏమి చేస్తాం? Exemption బాధలు ప్రపంచంలో అన్ని బిల్లులకు అన్ని పన్నులకు తప్పవు అదేవిధముగా 20 ఎకరాలుంటేనే లెక్కలివ్వాలి తక్కువవుంటే అక్కరలేదు

యం. సత్యనారాయణరాజు 20 ఎకరాల పరిమితి లేకుండా land holders list కావాలంటే సరిపోతుంది పూర్తి భోగట్టా వస్తుంది దానిని బట్టి గ్రామోద్యోగులు సరియైన భోగట్టా వ్రాయడానికి వీలుంటుంది, భూసంస్కరణలకు అనుకూలంగా వుంటుంది.

మిస్టర్ స్పీకర్ మీరు general question చెప్పారు దాని reasonableness దానికి వుంది వారు తెచ్చుకునే vote లను బట్టి వుంటుంది. నేను యేమి చేస్తాను?

*Mr. Speaker.* The question is

"That the Andhra Pradesh Agricultural Holdings (Census) Bill, 1957, be taken into consideration at once"

The motion was adopted

*The House then adjourned till Half Past Eight of the Clock on Wednesday, the 13th November, 1957.*